# ఉపోద్ఘాతము



ఆగస్టు విప్లవము జోరుగాసాగింది. పొందవలసిన ఫలితాన్ని పొందలేకపోయాము. కాని అనేక కొత్తపాఠాలు నేర్చుకోగలిగాము. రాజకీయాలు ప్రజలకు మంచినీటిప్రాయమైనవి. ఆర్థికదుస్థితిని బాపుకోవాలంటే. జాతీయగౌరవాన్ని నిలుపుకోవాలంటే, ప్రపంచ పతితప్రజలకు బాసటైనిలచి కులమత, వర్గరాహిత్య సమాజాన్ని స్థాపించాలంటే, ముందు మనము స్వాతంత్ర్యులముగావాలి. అమిత కష్టనష్టములకోర్చి రేయింబవళ్ళనక, విసుగు విరామములేక పాటుబడిననేగాని ఆస్వాతంత్ర్యాన్ని సాధింపగలేమని గుర్తించారు. వక్రబుద్ధితో కొంటెయెత్తులతో దొంగపోకిళ్ళుబోవు పార్టీలగుట్టు బట్టబయలైంది. దేశములో రైతుకూలి. కార్మికుడు, విద్యార్థి, యువకులు వారివ్యక్తిత్వ గౌరవాన్ని గుర్తించారు. అవసరమైతే వారి రక్తాన్నిధారబోసి స్వాతంత్ర్యాన్ని సాధించ సమాయత్తమైనారు. నిర్మాణయుత పార్టీకి యెదురుచూస్తున్నారు. ఇదే ఆనాటి పరిస్థితి. ఈపరిస్థితే నేడుకూడ మనలనెదుర్కొంటున్నది. దీనికి సరియగు పథకమే సోషలిష్టుపార్టీనాయకుడు రామమనోహర్ లోహియా మన ముందు బెట్టుచున్నాడు.

నేడు ముఖ్యంగా మనరాష్ట్రములోని అవకాశవాదులు సోషలిష్టు శబ్దంవింటేనే అదిరి చస్తున్నారు. దీనికి కారణమేంటో యీపుస్తకం చదివితే అర్థమౌతుంది. మహాత్మాగాంధీజీ చెప్పినట్లు తు.చ తప్పకనడవాలియని పట్టుబట్టారువీరు. షికారుగా జైలుకుపోయి, వెంటనే పదవీవ్యామోహముతో ప్రాకులాడుచు, విప్లవవీరులను నిరసించుచు, ప్రక్కవేటుగారానున్న అంతిమ విప్లవమునకు చేయుచున్న సన్నాహాలను దెబ్బగొట్టుచున్న దేశద్రోహులగు దద్దమ్మలనే యీపుస్తకం నిశితంగా విమర్శిస్తున్నది. అహింసామార్గమును వీడక, సత్యాగ్రహి చావునకు వెరవదని గాంధీజీ ఉద్ఘాటించుచున్న సూక్తికివన్నె తెమ్మని ప్రార్థించుచున్నాడులోహియా. ప్రతివాడు తనశక్తిని తాను తెలుసుకొని,

జాతీయ గౌరవాన్ని నిలబెట్టడానికి హింసను నమ్మనిమ్ము. అహింసను నమ్మనిమ్ము తన విధిని తాను సక్రమ పంథాలో నెరవేర్చినవాడే విప్లవ వీరుడని ఉద్బోధించునదే సోషలిస్టుపార్టీ పూర్ణముగా అహింస మార్గమును నమ్మినవానికి అందు తావుగలదు, పూర్ణముగా ఆధునిక విప్లవ మార్గాన రణరంగమున దూకగలవానికి చోటుగలదు. పదవీవ్యామోహులగు అవకాశ వాదులనుగాని, దేశమును మరచి, పరదేశ విదేశాంగ నీతికి అనుగుణముగా తాళాము వేయు గూఢచారులనుగాని చేరనే చేరనివ్వదు.

మితవాది గానిండు, అతివాది గానిండు, అహింసా సత్యాగ్రహి గానిండు, విప్లవ వీరుడుగానిండు, ప్రచారకుడు గానిండు, సిద్ధాంత వేత్త గానిండు, ప్రచ్ఛన్నుడు గానిండు, అంతిమ విప్లవానికి సన్నాహమగుటకు, నిర్మాణ సంస్థకు కట్టుబడి, అధికార వాంఛను విడనాడి, జాతీయ పోరాటమునకు యే రూపమునగాని చేయూతనిచ్చు ప్రతి వ్యక్తియు తన సరిసమానుడుగా గుర్తించు వర్కరుకు వెన్నెముకే సోషలిస్టుపార్టీ. కాంగ్రెసు వాలంటీరు దళమేననికూడ చెప్పవచ్చును. వ్యక్తిగతోత్సాహాన్ని చూరగొన్న కాంగ్రెసుకు, నిర్మాణయుత సంస్థను చేయూతనిచ్చి, కాంగ్రెసుగోరు, రైతుకూలి, కార్మిక, స్వేచ్ఛారాజ్యాన్ని స్థాపించ అందరమై నిలుచుటకు బద్ధకంకణులుగమ్మని మనల నాదేశించుచున్నది.

నిర్మాణయుత సంస్థ అంటే యేంటి, దాని విధియేంటి. ఆవశ్యకత యెట్టిది, యెట్టి ఫలితాలను పొందగలము, మన శక్త్యానుసారము మనము నిర్వహించగల కార్యక్రమస్థాయి యెట్టిది, అను విషయాలు గ్రహించడానికి ప్రతి వర్కరు తప్పక యీ పుస్తకాన్ని చదవాలి. 1942 ఆగష్టు ఉద్యమరోజులలో వ్రాసినా యీనాటికి మన లోపాలను సరిదిద్దుకోడానికి మార్గాన్ని చూపుచున్నది యీ పుస్తకమే. అన్ని రాష్ట్రాలలోకన్న మనరాష్ట్రంలో నేవాస్తవికపురోగమనశక్తులుగట్టిగా చైతన్యమొందియున్నవి. కార్మికులు కర్షకులు తమ హక్కులకొరకై సమ్మెలు జరుపుచు రాజకీయ చైతన్యాన్ని పొందుచున్నారు. పరదేశగూఢచారుల వీరి మధ్యనుండి తరిమివేయుమనము సన్నద్ధులమైనాము. ఇందుకే ప్రచ్ఛన్నోద్యమము సాగించడానికె యువకులు, విద్యార్థులు చాలా ధైర్యాన్ని సంపాదించారు. నేడు అవకాశవాదులు యే రాష్ట్రములోగాని కని విని యెరుగనంత ఘట్టిగా

యెదురై ప్రతిఘటిస్తున్నారు, విప్లవశక్తుల నీరసింపజేయడానికి, జాతీయ కాంగ్రెసు సిద్ధాంతాలనే గంగలోగలుపుచు, కుల మతములను తేవదీస్తున్నారు. పంట నభివృద్ధి చేయాలని కాంగ్రెసు ఆదేశిస్తుంటే, పొగాకు పండుచోట పొగాకు పండించమని, గంజాయి పండించుచోట గంజాయి పండించమని, ఊ అంటే ఒక సంస్థ ఆ అంటే ఒక నినాదం యెప్పటి కప్పుడు సృష్టించుచు, దేశానికి ఘోర అపచారం చేస్తున్నారు. ఇట్టివారే నేడు కాంగ్రెసు సంస్థను కైవశంచేసుకున్నారంటే, ముందుముందు విప్లవ వీరులు యెట్టి ప్రతిఘటనాశక్తిని యెదిరించాలో అర్థం కాగలదు. పట్టుదలవుంటే పనిని సాధిస్తాం. రష్యా గూఢచారులను కాంగ్రెసునుండి వెళ్లదరుమగల మనం, మన ప్రవిత్ర ఉద్దేశాన్ని నెరవేర్చి, ప్రజలకు అండయ్యై నిలచి, అంతిమ పోరాటానికి అన్ని కష్ట నష్టాల్ని యెదుర్కోవలసిన మనం, యీ అవకాశవాదులలోప భూయిష్టత బైటపెట్టి, త్వరలోనే గెంటివేయగలం. ఇందులకు సరియైన మార్గాన్ని చూపుటకు యీ పుస్తకం యెంతో తోడ్పడుతుంది అని వేరుగా చెప్పనక్కరలేదు.

అనువాదకుడు.

ముదివర్తి సత్యనారాయణ



# పురోగమనము



తిరుగుబాటుదారులను ప్రచ్ఛన్నులను, తదితరవర్కర్లను నేనుకొన్ని ప్రశ్నలడుగుచున్నాను. మనమెప్పుడైనా స్థిమితముగా కూర్చొని మనము నడిపిన కార్యక్రమమునుగూర్చి ఆలోచించుకొంటిమా? లేదా గతించిన చరిత్రను తలచుకొని నిరుత్సాహపడుచున్నామా? నిలకడపట్టుదల లేక యెర్రనుజూచిపరుగిడు చాపలాగున వివిధ ప్రోగ్రాములు చేద్దామని పరుగిడుచున్నామా? ఇదంతయుగాక నియమక్రమబద్ధమైన ఒకేఒక యేకైకప్రోగ్రాము తయారుచేసి కార్యసాధనకు నడుముగట్టి పనిచేయుచున్నామా?

నాతోటివర్కర్లలో యెప్పుడైన పైప్రశ్నలను ప్రస్తావించిన అమిత నిరాశా జనకమైన జవాబులు వచ్చేవి భయంకరమైన పోరాటముల వలన ప్రజలు అలసిసొలసిపోయినారు. ఇంకను ప్రజలు పోరాటమునకు విముఖులుగావున్నారు. పబ్లికువర్కర్లు సాహసమునకు, త్యాగమునకు సిద్ధముగావలెను. పర్యవసానముగా ప్రచ్ఛన్నులు కార్యక్రమమును కొనసాగించుటకు చాల్లతక్కువ అవకాశ మేర్పడినది. క్రొత్తవాలంటీర్లను రంగములోకి దింపుట కష్టముగావున్నది. ధనసహాయము శూన్యమైనది. ఇట్టి అడ్డంకులు లెక్కలేకుండా చెప్పేవారు. ఈ అడ్డంకులలో కొంతవరకు యదార్థమున్నదని నేనును వప్పుకొందును. ప్రపంచములో గ్రుడ్డివాడున్నాడు. వారికి చదువునేర్పాలి. రోగపీడితులున్నారు, వారికి నయముచెయ్యాలి. విపరీతమైన శీతోష్ణస్థితులున్నవి. వాటిలో ప్రజలు నివసించాలి. ఇవి చాలకష్టసాధ్యమైనపనులు. అందుకని ప్రయత్నింపకున్న ప్రపంచము అసమర్థమగును, తెలివిగల్గి కార్యసాధనయందు పట్టుదలకు వారు ప్రయత్నించారు. గ్రుడ్డివానికి చదువునేర్పగల్గారు. మందులుకనిపెట్టిరోగిని ఆరోగ్యవంతుని చేశారు. విపరీతవాతావరణములో ఉండనెలవు లేర్పరచినారు. తాము వేరేప్రపంచమునుండి దిగివచ్చామని కొందరనుకొనుచున్నట్లు నిర్వీర్యులై మూల కూర్చొలేదు. మనముకూడా కార్యాసక్తులమౌదాం. దీక్షవహిద్దాం. ఏమిచెయ్యాలో. ఏదిచెయ్యకూడదో, ఎల్లాచెయ్యాలో నిర్ణయించుకొందాం.

ముందు నేను చేసినదానిలో పునరాలోచన ప్రారంభిస్తాను. దినదినమునకు పరిస్థితులు, భావములు యేయేవిధముగా మార్పుచెందుచున్నవో

తెలియజేయుట నా భాధ్యతగానున్నది. క్రొత్తవారికి చైతన్యము గలిగించి విజయవంతమగు పోరాటములకు క్రొత్తసంఘముల నిర్మించుటకూడ నా భాధ్యతగానున్నది. బాపూజీ నిరసన వ్రతానంతరము గతకొద్దిమాసములలో నా ప్రయత్నములన్నియు నిష్ఫలములైనవి. చెప్పినంత చేయలేకపోయాను. నా ప్రయత్నములు కాస్తోకూస్తో కొనసాగిన అది నేను గమనింపనేలేదు.

నేను నా కార్యక్రమమును కొనసాగించలేకపోవుట నాతోటి అనుచరులయొక్కయు, ప్రజలయొక్కయు అసమర్థత అని చెప్పి తప్పుకోదలచలేదు. వారిని సమర్థులుగా చేయలేకపోవుట నా అసమర్థతని చెప్పెదను. ఏవో సాకులు చెప్పి తప్పుకోక తిరుగుబాటుదారుగాని, ప్రచ్ఛన్నులుగాని, యింకెవరుగాని గతకొద్దిమాసములలో వారి కార్యక్రమమును పునరాలోచించుకొందురని ఆశించుచున్నాను.

నేను విజయవంతుడ కాకపోవుటకు కొంతవరకు అశ్రద్ధ అజాగ్రత్త కారణాలు. దీనికొక ఉదాహరణ చెప్పెదను. నిషేధవాఙ్మయమునకు నేను సహాయపడునప్పుడెల్లను అచ్చువేయించుట యెంత ముఖ్యతమమో, అంతకెక్కువని అంగీకరింపకున్నను, పంచిపెట్టుటకూడా అంతముఖ్యతమమైనదేనని నొక్కిచెప్పాను. అటులనే వ్రాయుట యెంతముఖ్యతమమో, అచ్చువేయించుటకూడా అంతముఖ్యతమమైనదేనని తెలియజెప్పాను. ఇంత కష్టముతో సేకరించిన వాఙ్మయముతో క్రొత్తవారిని సేకరింపలేకపోతిమేని మనము పడ్డశ్రమంతయు వమ్మైనట్లె. కాబట్టి పంచిపెట్టుకార్యక్రమమును సాగించువాడు మన రిక్రూటింగు సార్జంటన్నమాట. మన అర్గనైజేషనుకు కొలికిపూసన్నమాట. నేను యీమాటలను చెప్పుచుంటే, బ్రిటన్ల అధీనములోనున్న భారతదేశములోని న్యాయాధిపతి న్యాయశాస్త్ర నిర్వహణమును ప్రభుత్వమునకు చెప్పియు. ఉపయోగము లేకపోవుట జ్ఞాపకము వచ్చుచున్నది. కాబట్టి వచ్చే స్వాతంత్ర్య దినోత్సవములోపల, మన ప్రచురణ ప్రచారమువల్ల ప్రజలు మనల నేమిచేయమని కోరుచున్నారో మనకు తెలియజేయుచు, అదేవిధముగా ప్రజలను మనమేమి చేయుమని కోరుచున్నామో వారికి తెలియజేయుచు, దినదినము క్రొత్తవర్కర్లను, కార్యకర్తలను తయారుచేయు సామర్థ్యముగల వందలాది డిస్ట్రిబ్యూటర్లను తయారుజేయ

తీర్చవహిద్దాం. నేనుదీనికి బద్ధకంకణుడనైనాను. ఈవిధముగా చెమటోడ్చి కష్టించిపనిజేసి తయారుజేసిన వ్రాతలు, అచ్చొత్తించుట. నితిప్రతిఘట నాశక్తిని సమకూర్పగలిగినయెడల!అంతకంటెను మనమిక ఆశించుఫలితము వేరేమియు లేదు.

## 2. ఉత్సాహము నిర్మాణము.

వ్యక్తిగతోత్సాహానికి ప్రజలను, ఆర్గనైజుచేయుటకు అవినాభావ సంబంధాన్ని నేను గుర్తింపజాలకున్నాను. నాలోనే కాదుమన అందరిలో కూడా యీ సంబంధమును యేదోఒకరూపములో అర్థము జేసికోలేకపో వుటయే మనలోవున్న అసమర్థత్వమునకు మూలకందమగుచున్నది.

బాపూజీ అదుపుఅజ్ఞలలో పెరిగిన కాంగ్రెసువ్యక్తిగతోత్సాహము పైననే ఆధారపడియున్నది. ప్రజలను నిర్మాణయుతముగా ఆర్గనైజుచేయడం వదలివేసిందనే చెప్పవచ్చును. కాంగ్రెసు ఒకపెద్ద నిర్మాణయుతసంస్థగా భావించడం పొరపాటేఅగును యెలక్షన్లలో గెలుపొందుట. లాను తిరస్కరించుట, బజారుస్త్రైకుల నిర్వహించుటలో సమర్థమైనసంస్థ కాంగ్రెసు సంస్థ. పెద్దపెట్టున సమ్మెలుసాగించుట, ప్రభుత్వగమ్యస్థానములపై యెదురు ముట్టడులు వేయుటలో కాంగ్రెసు తనుతానె పునర్నిర్మాణము చేసుకోవలసియున్నది. వ్యక్తిగతోత్సాహమువరకుతీసుకుంటె కాంగ్రెసు ఒకబలీయమైనసంస్థ. ప్రజాయుతనిర్మాణముగా యింకాబలీయముకాలేదని చెప్పవలెను. పిడుగుపడలెవిరుచుకుపడ్డ పోరాటమువల్ల నిర్మాణయుతముగా కాంగ్రెసు అణచివేయబడినను వ్యక్తిగతోత్సాహమును, అభిమానములను చూరగొనినెనుకటికన్న యెన్నోరెట్లు బలీయమైనది.

ప్రతి వ్యక్తిలోను జాతీయోద్రేకము చంచలము. పోరాటంలో భయకంపితుడై నిరుత్సాహము జనించినప్పుడు వంగిపోవును. విశ్రాంతి తీసికొన్న మరికొంతకాలమునకు ప్రజ్వరిల్లును. ఆవుత్సాహము అజేయమనుట పొరపాటు. ఎవరో యెక్కడో అట్టివారు జన్మించుట అసాధారణవిషయమా. అజేయమని పద్యకావ్యములలో, ఉపన్యాస వేదికలపైన చదువవలసినదేకాని, అనుభవయుతముగాదు. ఇచ్చట నాస్నేహితుడు చెప్పిన ఒకమాటను జ్ఞాపకముచేతును. "నేను ఒంటరిగానున్నపుడు పనికి

మాలినవాడినే. నిర్మాణయుతమైన సంస్థలోనున్నపుడు ధైర్యంవహింప గలను". ప్రజలలో అధికసంఖ్యాకులలో ఇది నిజముగా కన్పట్టుచున్నది. కాంగ్రెసులోవున్న మనలోచాలామంది మనదేశములో ప్రతివానిని ధైర్య సాహసోపేతునిగా చేయుటకు పాటుబడుచున్నారు. కాని మనము ప్రతి ఒక్కరము నిర్మాణయుతముగా ప్రజలను యేకైక ధైర్యసాహసోపేత సంస్థగాచేయు బాధ్యత గుర్తించుటలేదు. వ్యక్తిగతధైర్యమునకు, ధైర్య సాహస ప్రజానిర్మాణయుత సంస్థకు ముడివేయు, మనము యిప్పుడు పాటుబడ ప్రారంభించవలెను.

ఇచ్చట చరసాలలోనున్న మనజాతీయ వీరులగురించి విచారింతము. డిటెన్యూలైతేనేమి, శిక్షవిధింపబడి జైలుకుపోయినవారైతేనేమి, నలుబది వేలు బాపుజీకూడ వీరిలోఒకడు. కొందరు దీనికి అసాధారణమైన ప్రత్యే కతజూపుదురు. గాంధీజీని చరలోనుంచినంత మాత్రాన బ్రిటిషు ప్రభుత్వ మును ప్రపంచమంత ద్వేషించునని తలచుచున్నారు. ఇందువలన గాంధీజీని విడుదలచేసి జాతీయ ప్రభుత్వమును కట్టిపెట్టునని ఊహించుచున్నారు. భారతీయుల త్రొక్కిపెట్టి, గాంధీజీని చెరలోబెట్టి; ప్రపంచములోని జాతులన్నిటికన్న యేహ్యమైనజాతి బ్రిటిషుజాతి అనిరుజువు చేసుకొంది. ఇంకా యీసంగతి ప్రపంచమునకు రుజువు కావలెనని కొందరు యెందుకు తలచుచున్నారో గ్రహింపజాలకున్నాను. గాంధీజీని చరలోబెట్టుట ప్రపంచములో బ్రిటనుకు శాపముతో సమానమైనయడల; యెన్నిరోజులు బాపుజీని చరలోవుంచుతారో, అన్నిరోజులు; రోజురోజుకు మనము ప్రపంచమందు నిర్వీర్యులము; దుర్బలులమై పోతున్నామని గుర్తించాలి. గాంధీజీ; జవహరుపండితుడు. అజాద్, సర్దార్ పటేలు, రాజేంద్రప్రసాదు యింకా నలుబదివేల జాతీయవీరులను, దేశసేవకులను, చెరలోనే వుంచుట దౌర్భాగ్యమైన విషయమే. ఈదౌర్భాగ్యమైన విషయమే మనలను కొరడాలతోకొట్టినట్లు విధివిరామములేకుండా పోరాటమునకు సన్నాయత్త పరచలేకపోయిందంటే అదిమరీ దౌర్భాగ్యమైనవిషయం.

యుద్ధానంతరపునర్నిర్మాణములో, శాంతిసమావేశములలో యేదో త్రోవ్వి తలకెత్తుతారంటె నమ్మట నిరాశ, దుర్భ్రమ, బేలత్వం. యుద్ధా నంతర శాంతి సభలలో భారతదేశమును అరాజకముగా నుంచి బ్రిటను నోరెత్తలేదని కొందరు వెర్రి కలలు కంటున్నారు, వీరు బ్రిటిషువారి సిగ్గు

మాలినతనమును, సాహసమును గమనింపలేకున్నారు. ధనము అధికారము
వచ్చేటట్లయితే, నరకకూపంలో, హేళనా లోకంలో, నిశ్చింతగా యుం
డగలది బ్రిటిషుజాతి. కాని మనలో కొందరిని అంటు జాడ్యమువలె యీ
ఆశాభావము వీడజాలకున్నది. యుద్ధానంతరము తన ఆహారము, లాభము
లకు చాలా తాపత్రయ పడవలసియున్నది. మన దేశపు ఆర్థిక దౌర్బల
త్వం, సైనిక నిరుద్యోగములు చుట్టు ముట్టుతవి. ఇట్టి యెన్నో రకముల
బాధలు బ్రిటిషుప్రభుత్వమును చుట్టు ముట్టుచున్నవి. ఇవి యెంత జాస్తిగా
వెంబడిస్తే, అంత అధికకాలము జాతీయ నాయకులను నిర్బంధములో
నుంచవలసివస్తుంది. మన విజయాపజయములు యుద్ధానంతరము లోపల
బ్రిటిషు బలాన్ని యెంతవరకు సడలగొట్టగలమో దానిపైనే ఆధారపడు
తుంది. కాన కార్యదక్షులకు, యుద్ధము యుద్ధానంతరమను వెనుక ముందు
ఆలోచనలు పనికిరావు. ప్రపంచ ప్రజాభిప్రాయము రోజురోజునకు
కోల్పోవుచున్న బ్రిటిషు ప్రభుత్వ బలముపై యెప్పుడు నిర్భీతిగా ముట్ట
డింపగలమో, అప్పుడే స్వేచ్ఛావాయువులు పీల్చగల్గుతాము.

మన దేశములో యితర సాంఘిక సమస్యలుగూడ తాండవించు
చున్నవి. అందులో ఒకటి క్షామము. బ్రిటను అనుసరించు యుద్ధ పద్ధతులు,
రాజ్య నిర్వహణ విధానము గమనించి 1942 నవంబరులోనే యిది పసి
బట్టగలిగాము. కాంగ్రెసుపై నిందారోపణ చేయుచుకూడ భవిష్యత్తు
క్షామము, దానికి మనముచెప్పినచికిత్సబయటపెట్టినందులకు మాస్వకువెల్-
కృతజ్ఞులము. కాని ప్రజా తిరుగుబాటు కూడా వస్తుందని మనము ఊహిం
చాము. క్షామము వచ్చిందిగాని, ప్రజాతిరుగుబాటు రాలేదు. మనము
సాంఘిక సమస్యలను బాగుగా పరీక్షింప గలిగాముగాని, సక్రమమైన
నిర్వహణ సంస్థ లేకున్న, ప్రజలు వారుపడు కష్టములవల్ల, తిరుగబడలేరని
గ్రహింపలేకపోయాము.

ప్రస్తుతసాంఘిక, సామరశ్యవాస్తవికశక్తులు, యెన్నోరీతుల మనల
చుట్టుముట్టియున్నవి. విప్లవమునకు పరిస్థితులు సానుకూలముగానున్నవి. లంచ
గొండితనము, హత్యలు అను రెండు స్తంభములపై మనదేశములో బ్రిటిషు
ప్రభుత్వము నిలబడియున్నది. ఎవ్వరును నీతి నియమములు, శాంతిభద్రత
లపై ఆధారపడిందని యేమాత్రం చెప్పలేరు. మనదేశములో ప్రజాసముదా
యమునందు పరప్రభుత్వమంటేఅసహ్యముయేహ్యత మిన్నుముట్టినవి. అయిన

రెండులకు తిరుగబడలేకున్నారు? తిరుగబడితే గెలుపొందగలమని కాస్త ఆశజూపగలవ్యక్తులు, సంస్థలు లేకపోవుట యేకారణము. బ్రిటిషుప్రభుత్వానికి తాకీదుసిద్ధముచేసిపెట్టబడి తయారుగాగలదు. ఇదివరకున్న యెన్నో రెట్లు ప్రజాహృదయాన్ని చూరగొన్న కాంగ్రెసు బలవంతమైయున్నది. ప్రస్తుతము దెబ్బగొట్టుటకు సడలిపోయివుంది. కాని బ్రిటిషు లంచగొండితనము పాత్యలు ప్రజలలో రోజురోజునకు ద్వేషాన్ని ప్రకోపింపజేస్తున్నవి. ఇందువల్లనే బర్మాను, జపానును జయింపబలాన్ని కోల్పోయినది. కాని పోరాటముసాగింప అన్నిశక్తులు సమకూడినవి. రెండు అడ్డంకులు మాత్రము నిలచివున్నవి. ప్రభుత్వమునకు, దానిసేవకులకు, సహాయకులకు చాలినంతలంచమీయగలశక్తి మొదటిది. నిర్మాణయుతముగా విప్లవమును కొనసాగింపగలసంస్థ ప్రజలకులేకపోవుట రెండవది. ఏదియేమైనను, యేదేశములోగాని, యేకాలములోగాని, ప్రజాపోరాటానికి యింత అనుకూల వాతావరణము యెప్పుడును యేర్పడివుండలేదు.

కొద్దిరోజులలో మనము నిర్మాణయుతమైన సంస్థనేర్పరచి జయము సాధింపగల్గునట్లు మనప్రజలను పోరాటానికి సన్నద్ధపరచగలమా? ఇదే ముఖ్యమైన ప్రశ్న. ఇందుకు పోయిన సంవత్సరములో వచ్చినట్లు పరిస్థితుల ప్రేరేపణమూ ముఖ్యము. ఇట్టివి తరచువచ్చుచునే యుండును. సరిహద్దుపైరేగు యుద్ధజ్వాలలు రెండవపక్షము. మనము యీ రెంటిలో పరిస్థితులలో ప్రారంభించాలి! ఈ ప్రశ్నకు సంపూర్తి సంతృప్తికరమైన జవాబు యివ్వలేను. నిర్మాణయుత సంస్థ అంటే దేశము నాల్గు మూలల గడియారము మాదిరి ఒక్కసారి దెబ్బగొట్టగల సంస్థ అంటే, అట్టి సంస్థను తయారుచేయుటకు మనకు మనుష్యులుగాని, ధనముగాని, అవకాశముగాని లేదని నిర్మొహమాటముగా చెప్పివేయగలను. అయితే పరిస్థితులు సవ్యముగా నుండేటందుకు కొన్ని సంవత్సరములు విప్లవాన్ని ఆపవలసిందేనా ?

ఇదే ముఖ్యమైన ప్రశ్న. ఇచ్చటనే ఉద్యమానికి వ్యక్తిగతోత్సాహమును, కార్య నిర్మాణమును కలిపి ముడివేయడానికి సాంఘిక సమశ్యలు యెట్లుపయోగించునో ఆలోచించవలయును. కార్య దీక్షితాశక్తుల గురించి వాటివల్ల ఉద్యమానికిగల్గు సహాయమును గురించి నేను యెక్కువ అంచనా వేయుచున్నానన్న యెడల, వాస్తవిక స్థితిగతులను అర్థముజేసికో

లేక పూర్తిగా వదలివేసిన ప్రజలు జాస్తిమంది కలరని తలంతును. ఉద్యమమునకు సన్నద్ధముగా నున్న సంస్థలకొరకుజూతురు. కనుగొనలేకపోదురు. విప్లవము విఫలమైనదని తలంతురు. అంతటనైనను యింటికి పోయి కూర్చొక విషపూరిత ప్రచారాన్ని మొదలుపెడుదురు. వారు అర్థము చేసుకోలేక, యితరులపై అపరాధమును రుద్దతలతురు. కూపస్థ మండూకములవలె కార్యదీక్షతా శక్తులను వీరు గుర్తింపలేకపోదురు. నిరాశాపరులై, నిర్వీర్యులై, అవినీతిపరులై పరిస్థితులు చక్కగా లేవని కార్యదీక్షతా శక్తులను నిరాశాపరుల జేయు ప్రచారము ప్రారంభింతురు. ఇట్టివారు వారేమిచేయలేకున్న. దుష్ప్రచారముచేయక మిన్నక మూలకూర్చొనుట మంచిది. మన విప్లవము అగస్మాత్తుగా చచ్చునది కాదు. కాన వీరి అపవిత్ర హస్తములతో కోసి పరిక్షింప నవసరములేదు. కార్యదీక్షత, గాఢనమ్మకము ఉన్నపుడే ఉద్యమము విజయవంతమగును.

ఈనమ్మకము గ్రుడ్డినమ్మకముగా వుండకూడదు. విప్లవమునకు అనుకూల వాతావరణమును గలిగించు పరిస్థితులను, వాటి అవశ్యకతనుగుర్తించి మనము పనిచేయవలయును. పడకకుర్చీలోకూర్చొని ఉబుసుపోకకు మనలను విమర్శనముచేయు రాజకీయవేత్తలు, వారితర్కమువల్ల చాలఅనుభవవంతులుగా కన్పింతురు. ఇది కొన్నికొన్ని ఘట్టములలో ప్రమాదకరముగా పరిణమించును. ఒకొక్కక్కతరి ఉద్యమములలో కష్టించి పనిచేయువర్కర్లు యీసిద్ధాంతరాద్ధాంతములవిని మోసపోవుదురు అప్పుడు ఓడిపోయామని కాళ్ళుజారవేసి కూర్చొందురు. ఇది చాలపొరపాటు పిషాదకరమైనవిషయం. యోచనలేక నోటికివచ్చినట్లు మాట్లాడుప్రతిమాటయు ప్రమాదకరము, దుర్బలచిహ్నము ఉద్యమానికి వట్టివాదవివాదములు శత్రువులు. గాఢతరమైన భక్తివిశ్వాసములు ప్రాణము. వాదోపవాదములు విప్లవోద్రేకత్వాన్ని యినుమడింపజేసిన లాభకరము. ఆనెత్తురు ప్రవాహమును క్షీణింపచేయుటయేకాక గుండెనే ఆపినపుడుప్రమాదము గాఢతరమైన నమ్మకము అచంచలమైన విశ్వాసమున్నపుడే స్వాతంత్ర్యపోరాటము విజయవంతమగును. పెద్దపెద్ద సాంఘికసమస్యలు, యెట్లుపరిణమించుచున్నవో గమనించి ఎంతక్లిష్టపరిస్థితులలోకూడ అచంచల భక్తివిశ్వాసములతో వెనుదీయక పాటుపడుటయే మనకు మనోధైర్యమును ధృఢతరముగా బలపడచేయును. ప్రతివానిలో నమ్మకము విశ్వాసము పాతుకొనిపోవలెను.

మరలమనమిచ్చట వ్యక్తిగతోత్సాహమునుగూర్చి చర్చింపవలెను. ఏదేశములోగాని పరిస్థితులు ఒకరూపమునుండి యింకొకరూపము పొందుటకు ముందు వ్యక్తిగతాభిప్రాయము, ఉత్సాహములలో, చైతన్యము ముఖ్యావసరము, నిర్మాణాత్మక సంస్థల నిర్మించుటకనేక అడ్డంకులున్న మనదేశములో దీనిప్రాముఖ్యము చాలగమనార్హము. వ్యక్తిగతోత్సాహము అభిప్రాయములపై ఆధారపడి పెద్దదైనకాంగ్రెసుసంస్థనుగూర్చి ఆలోచింతము. దీని ప్రాధమికసభ్యులు నలుబదిలక్షలు. అంటే భారతప్రజానీకములో నూటికి ఒకడన్నమాట. అయితేనేమి. పోరాటములో పాల్గొన్నవారి సంఖ్య నూటికి యిరువదిమంది యుండవచ్చును. ఇదేపరిస్థితుల ప్రోత్సాహము. దీనినిఅడ్డలేము. అడ్డవలసిన అవసరంకూడాలేదు. అట్టిపరిస్థితులలోమనము, ప్రజలలో వ్యక్తిగతోత్సాహమును ఉద్రేక పరచి పోరాటములో మరీమరీయెక్కువమంది పాల్గొనేటట్లు చేయుట ముఖ్యావసరము కాని యిచ్చట మన. ప్రజలలోని ఉత్సాహోద్రేకముల క్రమపద్ధతిని నడపి వారిని విజయవంతులుగా చేయవలసిన బాధ్యత మనపైననే నిలచి యున్నది. ప్రతిజిల్లాలోను వారికిచ్చినపపనిని క్రమముగా చేయగలిగిన గట్టిపునాదులపై తయారుచేయబడిన వర్కర్లు ఒకవందమంది వున్నట్లయిన మనము మనబాధ్యత నిర్విఘ్నముగా నిర్వహింపగలమని విశ్వసించుచున్నాము. మొత్తము దేశముమీద వీరు 25,000 మందివుంటారు. వీరు ఉద్యమానికి యినుప కవచంలాగ వుండగలరు. ఇందుమూలంగా మనదేశములో ప్రతి 20, 000 జనాభాకు ఒకవర్కరును మాత్రమే కోరుచున్నామన్నమాట. ఇది చాలస్వల్పవిషయమే. కాని నేటిమనదేశీయ అనుకూల వాతావరణాన్ని అవలోకించిన బ్రహ్మాండముగా కన్పించుచున్నది. ఈ నిర్మాణ నిర్వహణములోకూడ వ్యక్తిగతోత్సాహమె మనకు శరణ్యము. ఈనిర్వహణమును దేశమంతకు ఒకేకేంద్రముగావుంచి నడపలేమనుకొన్నాముకదా. వివిధకేంద్రముల నాధారముచేసుకొని! మనము కార్యము కొనసాగించవచ్చునని యిచ్చట చెప్పుచున్నాను. దేశీయ, రాష్ట్రీయ కేంద్రములకు జిల్లాకేంద్రములతో సరాసరి సంబంధ ముండనవసరములేదు. జిల్లాకేంద్రములు పుట్టి వృద్ధిపొందాలి. దాని యిష్టానుసారమే వర్కర్లను నిర్ణీతకార్యములకు నియమించుకొని, పనిచేయవలెను. ఈబాధ్యత కేంద్రములోనేవుంచిన నిషేధింపబడినపుడు కార్యక్రమమును కొనసాగించుట

కష్టసాధ్యమగును. ఏయేఅధారములు, పరిస్థితులమీద కార్యక్రమాన్ని కొనసాగించవలయునన్న బాధ్యతమాత్రము కేంద్రములో వుంటేచాలును. ఈవిధముగా జిల్లాయూనిట్లను నియమించిన ఆదిలో ఒకదానికొకటి సంబంధము లేకుండగనే పని చేయు చుందురు. కేంద్రసహాయమువల్ల సమానపురోభివృద్ధి పొందుచుండును. విప్లవమునకుముందు యీయూనిట్లు కేంద్రముతో వ్యక్తిగత సంబంధము యింకేవిధమగు సంబంధములేకనే కేంద్రము ప్రచురించు కరపత్రములు, యితరములు, సకాలమునకు తెచ్చుకొని అనుసరింపగలశక్తి సంపాదింపవలెను. ఇదిట్లు గట్టిపడవలెను. అప్పుడు ఉద్యమమధ్యములో యెంతక్లిష్టపరిస్థితులలోనైనను, ఒకయూనిటు సంగతి యింకొకటి గమనింపకనే, అన్నియు సక్రమముగా ఒకేమార్గమున పురోగమింపగలవు. ఈ విధముగా మనము తయారైనపుడే ఉద్యమమునకు కవచముగావుండి, యెంతటి ప్రతిఘటనాశక్తినైనను యెదిరించి ప్రజలను విప్లవములో సక్రమపంథాలో నడుపగలము.

జిల్లా యూనిట్లకు యీ స్వేచ్ఛవుండి కేంద్రమునుండి యిచ్చుసూచనల నన్నియూనిట్లు సక్రమముగా అనుసరించుట మన ఉద్యమమునకు గట్టి పునాది ఏవిధముగా యేకార్యక్రమములో విధిని సరిగా నిర్వహింపగలమనునది, ప్రచారముపై నాధారపడియున్నది. దురదృష్టవశాత్తు ప్రచారమన్న మనదేశములో చాలసంకుచితదృష్టితో అర్థముచేసుకొనుచున్నాము. క్రమబద్ధమైనప్రచారము, మనకు లేనేలేదు. ఏవో ఉపన్యాసాలు, తర్వాత జైలుకుపోవుట మనకార్యక్రమమైయున్నది. జైలుకుపోవుట యింతవరకు మన పోరాటములో ప్రధానస్థాన మలంకరించినది. అందుచే యీడుపోని ప్రధాన్యతగల ప్రచారమును గుర్తించాలి. ఈ ప్రచారమునకొక ఉదాహరణముచెప్పినను, ఈ రోజులలో బ్రిటిషుప్రభుత్వము చాలక్రూరప్రభుత్వమని ప్రచారముచేయుట అనవసరము. కారణము. మనప్రజలు మనము చెప్పుదానికన్న యెక్కువ అర్థముచేసుకొనియున్నారు. 1930 లో బ్రిటిషు ప్రభుత్వఘాతుకచర్యల నేకరువుపెట్టుట ముఖ్యావసరము. ఇప్పుడు ప్రజలు యేవిధముగా ప్రతిఘటించి విజయము సాధించవలసినదని చరిత్రాత్మకముగా అర్థమగునట్లుచెయ్యాలి. ప్రభుత్వమును వ్యతిరేకించి ద్వేషించుటకు మారుసమయముదొరికినపుడు విరుచుకపడ ప్రయత్నించుచున్నాము. ఇదిగుర్తించాలి. మానవాతీతమైన స్వాతంత్ర్యదేవతను ప్రార్థించుటకు,

ముచ్చటైన సంగీతము, చక్కనిబొమ్మలు అవసరము కావచ్చును. దాని పత్వ శృంఖలా విమోచనమున కనవసరము. వేదికలపైనెక్కి బ్రిటను మనల యేవిధముగా దోచుకొనిఆర్థికముగా బలహీనపరచుచున్నది ప్రజలకుచెప్పు టకు పాతవిషయములనే యేకరువు పెట్టకూడదు. ప్రస్తుత వాస్తవిక విషయ పరిశీలన చేయవలెను. నిషిద్ధ కరపత్రముల నచ్చువేయుట వృధాకాకూడదు. ప్రజలను స్వాతంత్ర్య వాంఛా పిపాసలను చేయుటకు కావలసిన ముఖ్య విషయములు, యేయే మార్గములలో వారికి బోధించవలసినది బయిటపెట్టవ లెను. లేకున్న మన శ్రమ నిరర్థకము. విప్లవ ప్రచారకుడు యేయే మార్గ ములు ప్రజలు అనుసరింపవలసినది చూపు యేజంటన్నమాట. చరఖా తీసుకోండి. ఇది చాల పురాతన ప్రచారము కావచ్చును. చరఖాయొక్క యిప్పటి ప్రత్యేకత దానిలో జరగవలసిన మార్పులు, అందువల్ల ఉద్య మమునకు సాయపడు విధము బోధించవలయును. ఉద్యమమునకు ప్రజల సమాయత్త పరచు ప్రచారము ప్రజల స్వాతంత్ర్య పిపాసతను అప్పు డప్పుడు కల్పించుచు ప్రయత్నించు విషయముల విపులీకరించి, చెప్పి అను మానరహితుల చేయవలెను. ఇప్పుడు మనము నివసించు ప్రపంచములో యేయే విషయములు యేయే విధముగా మార్పొందుచున్నది. సత్యాగ్ర హము, జైలుకుపోవుట, విధ్వంసమునకు మనము చేయవలసిన కార్య క్రమములు బోధించుట ప్రచారకుని బాధ్యతై యున్నది. క్రొత్త వర్క ర్లను సమాయత్తపరచు యేజంటు పదవి, ప్రజల సక్రమ మార్గమున నడుపు యేజంటు పదవికూడ విప్లవ ప్రచారకుడు నిర్వహింపవలయునన్న మాట.

ప్రస్తుత దేశపరిస్థితులు, నిర్మాణయుత సంఘములపైకన్న వ్యక్తిగ తోత్సాహముపైననే మనల నాధారపడజేసినవి. సర్వ మానవ స్వేచ్ఛా ప్రపంచమునకు పాటుబడు ఆధ్యాత్మిక వాదుల తర్కముగూడ మన పద్ధ తులపైపే మొగ్గుచున్నది. కమ్యూనిష్టు సిద్ధాంతప్రకారము "ప్రభుత్వము మానవులగాక సాధనముల పాలింపవలయును." మనము దీనికి వప్పు కొందుము. అట్టి సంఘములకే మనము సమాయత్తమగుచున్నాము. న్యాయ శాస్త్రములు, శిక్షలు నిర్బంధములు, నిరంకుశము లేని ప్రభుత్వమైనపుడే ప్రజలను స్వాతంత్ర్య ప్రజలనదగును. కాని యూరపులో సాధనపాలనము

మటుమాయమైనది. కమ్యూనిష్టు సిద్ధాంతములు నిరంకుశ ప్రభుత్వమునకు దారితీసినవి. వ్యక్తిగత స్వేచ్ఛ అదృశ్యమైనది. వ్యక్తిగతోత్సాహమునకు తావులేదు. అట్టివారు సంఘములుగా చేరినగాని మాట్లాడజాలరు. పాశ్చాత్యుడు ఒంటరిగానున్న మనస్సు దిన్నపాము. నిర్మాణయుత సైన్యములోనున్న వీరాధివీరుడు. ఇందువల్లనే సరియగు నిర్మాణయుత సంఘముల సహాయములేనపుడు పాశ్చాత్యుడు మానవాధముడుగా పరిణమించును. కాననే యూరపులో బలీయమైన నిర్మాణసంఘములకు ప్రాకులాడుదురు. వ్యక్తిగతోత్సాహము, స్వాతంత్ర్యముతో ప్రవర్తింప ధైర్యముకల మనుజుడేలేడు. భారతదేశములో మాత్రము మనము వేరుమార్గము ననుసరించుచున్నాము. వ్యక్తిగతముగా ప్రతిమానవుని కర్త, కర్త్రి, లేక స్థైర్యవంతునిగా చేయవూనుకొన్నాము. ఇందు కృతకృత్యులమగుటకు కాలవిలంబనము జరుగుగాక. కార్యసాధనకు పట్టుదలవహించాము. ఈవ్యక్తిగతోత్సాహానికి ప్రాధాన్యమిచ్చాము. నిర్మాణయుత సంస్థయీఉత్సాహానికి తోడు నీడ మాత్రమే.

కేంద్రములు స్థాపించాలి, కేంద్రముచూపు పునాదులపైన కార్య నిర్వాహక సంఘములు, జిల్లాయూనిట్లు నిర్మించాలి. ఇవన్నియు వాటి స్వేఛ్ఛానుసారము కార్యక్రమమును కొనసాగింపవలదా? ఆర్గనైజర్లకు కేంద్రముతో సంబంధముండనీ లేకపోనీ యీక్రింది సూత్రముల నర్థము చేసికొని కార్యసాధన కుద్యుక్తులంగా ప్రార్థన.

(1) కేంద్రము: అధికారము:— సాధారణ పరిస్థితులలో కూడ కాంగ్రెసు యిక్కడనే దెబ్బతిన్నది. ఇందువల్ల జిల్లాసంఘాలు అభివృద్ధికానేలేదు. ప్రతివ్యక్తి నిరంకుశాధికారమునకు పాటుబడువాడే. ఇంక నలుగుర్ని కలుపుకొని కార్యదక్షుడగునపుడు తనకు రెండంత లధికారము వచ్చుననన్నను నిరంకుశాధికారము చెలాయించ వీలులేదు కాననిరాకరించును. ఎంతకష్టమైనను యీవేరుపురుగును ప్రతిమానవునిలోనుండి తొలగింపవలెను. నిషేధింపబడిన పరిస్థితుల పరస్పరము ఒకరికొకరికి సంబంధముండుట కష్టము. మనము ప్రతిమానవునిపైన నిఘాపెట్టలేము 'వాని వ్యక్తిగత నమ్మకముపైననే ఆధారపడవలెను. ఇట్టి సమయములో యీ నిరంకుశత్వముంటే చాల అసూయలకు తావిస్తుంది. కాన దీనిని మొద

లంట నిర్మూలించటానికి, గట్టి కట్టుదిట్టములు తీసుకోవాలి. ప్రతి చిన్న పెద్ద విషయముకూడా మన అధికారము, అనుమతి పొందవలయునని బిర్ర బిగిసి కూర్చోకూడదు. అప్పుడు మనము ఊరుపేరు లేని యే చిన్న యూనిటునో నిర్వహింపగలము. అధికార అహంకారములు మట్టుపెట్టాలి. ప్రతి విషయములో మన ప్రాముఖ్యమునకు ప్రాకులాడకూడదు. మనము ప్రతి యూనిటుకు ప్రారంభమునుండి సాయముచేయ నవసరములేదు. ప్రారంభించారో లేదో మన చెప్పుచేతలలో మెలగవలెనని ఒత్తిడిచేయ కూడదు. రోజురోజునకు అనేక క్రొత్త యూనిట్లు స్థాపింపబడాలి. ప్రతి వారు నిర్ణీత కార్యక్రమ సాధనకు ఉద్యుక్తులు కావలెను. లేకపోతే నిరుపయోగము. ఈ కట్టుదిట్టములకు కట్టుబడకపోయిన మనమేమియూ చేయలేమని గ్రహించవలెను.

(2) నిర్ణీత కార్యక్రమము : బాధ్యత :—ప్రతివాడు ప్రతి పని చేయబూనుట, ఎవ్వరు యేపనిని కొనసాగించలేకపోవుట కూడదు. ఒకొక్క వ్యక్తి ప్రత్యేక నిర్ణీత కార్యక్రమమును నిర్వర్తించాలి. లేకున్న మన గోతిని మనమే త్రవ్వుకున్నట్లగును. ఇదే తగాదాలకు మూలము. కార్యక్రమము సుతరాము కొనసాగదు. కార్య నిర్వహణ సంఘములు వృద్ధిగావు, మనలను మనమే ధిక్కరించుకొనుట అంటారు. క్రొత్తవారు గాని పాతవారుగాని, నిర్ణీత కార్య క్రమమునకు పూనుకోవలెను. బాధ్యత వహించవలెను. ప్రతివాడు మోయలేనంత నెత్తినవేసుకోకూడదు. క్రొత్తవర్కరు వచ్చినపుడు మనము నిర్వహించుచున్న బాధ్యత కార్యక్రమములలో కొంత భాగమిచ్చి పని చూపించుటకుకూడా సంసిద్ధులము కావలెను.

(3) యూనిటుకు అయిదుగురు —నిర్ణీత కార్యక్రమమునకు బద్ధులమై అనుకొనినట్లు పని కొనసాగింప బద్ధకంకణులమైనాము. రోజురోజునకు వందలకువందలు వర్కర్లు వచ్చుచున్నవారి నందరనొకటే సంఘంగానుంచకూడదు. మోయలేని మోత ఒకబండిమీద వేసినట్లగును. కార్యము శూన్యమగును. వీరందరిని యూనిటుకు అయిదుగురు చొప్పున విభజింప

వలెను. ఏకార్యమునకు, యేవ్యాపారమునకు యెంత విస్తీర్ణమునకు విభజించుచున్నామో గమనించి వీరిని విభజించవలెను. ఇచ్చట కొన్ని ఉదాహరణము లిచ్చెదను. ఒక యూనిటులో అయిదుగురిని, అందుకు ఒకరిని నాయకునిగా నియమించితి ననుకొనుము. చెరసాలకు పోకుండా, కొన్ని బహిష్కరణ ప్రదర్శనములు చేయ వీరిని నియమించితిమి. ఇంతవరకే వీరు పట్టణములలో పనిచేయవలెను. ప్రతి వీధిలోకూడా "యూనిటుకు అయిదుగుర్ని" యేర్పరచి కార్యక్రమమును అవిఘ్నముగా కొనసాగించుటకు పాటుబడవలెను. దేశదాశ్య విమోచనమునకు ఫాక్టరీ వర్కర్లచే, వారు నిర్వహింప వలసిన బాధ్యత గుర్తింపజేయ యింకొక "యూనిటుకు అయిదుగురను" నియమించితిమి. దేశపరిస్థితులు యేవిధముగా నున్నది, వారిపరిస్థితులు యేవిధముగా నున్నది, వారి బాగోగులకు సమ్మెలను యేయే నియమానుసరణము చేయాలి, పోరాటము సాగుచున్నపుడు పనియెందుకు మానివేయ వలయునో బోధించుట వీరివిధి. వేరొకచోట పల్లెటూరి పౌరుడుగాని, పట్టణవాసిగాని, యేవిధముగా తీగెలు కత్తిరింప వలెనో నేర్పదలచు కొన్నాము. దీనికి యింకో "యూనిటుకు అయిదుగుర్ని" నియమించాము. ఇట్టివి అనేక యూనిట్లు నెలకొల్పి, ఉద్యమములో తీగెల కత్తిరించి, జిల్లామొత్తములోని ప్రభుత్వ నిర్వహణమును యెల్లాస్థంభింప చేయవలెనో వీరికి నేర్పవలెను. ఇంకో "యూనిటుకు అయిదుగురు" శత్రు ఆయుధపాణుల వద్దనుండి ప్రాణనష్టము లేకుండా ఆయుధములు లాగివేసి వారిని స్థంభింపచేయ నిశ్చయించితిమి. వీరు యింతవరకే నిర్వహించ వలెను. ఇట్టియూనిట్లు ప్రతిజిల్లాలో యిరువది యున్న చాలును. వీరు శ్రమను మరచి, కష్టించి, చమటోడ్చి పనిచేయ ధైర్యసాహసోపేతులుగా వుండాలి. అప్పుడు మన స్వాతంత్ర్య పోరాటము గెలుపొంది తీరును. వీరశంఖముల పూరించి విజయ దుందుభులను మ్రోగించగలము. ఇట్టియూనిట్ల ఆసరా చూచుకొని సామాన్య ప్రజలుకూడా తిరుగబడుదురు. ధైర్యమును ప్రజలు కోల్పోయినపుడు వీరు ధైర్యమును నూరిపోసి కొత్తఅవకాశముల చూపవలెను. ధైర్యము, సాహసముగలిగి, స్వేచ్ఛావాయువులు త్వరలో పీల్చదలచిన ప్రతివ్యక్తియు తన నిర్ణీతకార్యక్రమమును కొనసాగించుటకు తనయూనిటు నేర్పాటు చేసుకొని పని ప్రారంభింపవలెను. కేంద్రమే ప్రారంభింపాలని కూర్చున్నామంటే,

యింకో పదిసంవత్సరాల తర్వాతకూడా యిప్పుడు మనమెక్కడను న్నామో, అచ్చటనే వుండిపోతాము. కాన యెవరి ప్రోత్సాహమునకు యెదురు చూడకూడదు. ముందంజవేయవలెను.

స్వాతంత్ర్యపోరాటములో వ్యక్తిగతోత్సాహమునకు కార్యనిర్వాహణ సంఘములకు అవినాభావసంబంధముల గల్పించి కార్యసాధకుల మగుటకు యిదొక్కటే మార్గము.

## 3. జైలు - కర్తవ్యము.

లాను తిరస్కరించుట జైలుకు పోవుట స్వాతంత్ర్యేచ్ఛ కొక ఆయుధం. మనదేశపరిస్థితులబట్టి, యింకను ప్రాముఖ్యము వహించినది. ఈక్రూరనిరంకుశప్రభుత్వమును తిరస్కరించుటకు కర్రకత్తిలేని ప్రజానీకానికి విప్లవములో ముఖ్యమైన ఆయుధమైంది. బహిరంగపోరాటములో మరికొన్ని క్రొత్త ఆయుధములు బయటపడినందున జైలుకు పోవుటయన్న ప్రజలు యేహ్యముగా తలచుచున్నారు. "ఈసారి వూరక జైలుకు పోయినందువల్ల లాభములే"దని గాంధిజీ నొక్కి చెప్పినందున, ఈ ద్దేశపూరితులే కాకుండా, యిప్పటికి కూడా గాంధీజీ నితుచ తప్పకుండ అనుసరించుచున్నామనుచున్న పెద్దలు కూడ వాస్తవికత గ్రహింపలేక పోయినారు. విషమపరిస్థితులనుండి సులభముగా తప్పుకొనుటకు పోలీసువారికి నోటీసునిచ్చిరియో, యింక యేదో విధముగా మేము జైలుకు పోసిద్ధముగా నున్నామని తెలియపరచువారిని గురించియే గాంధిజీ అవిధముగా చెప్పాడని ఊహింపనగును. తిరస్కరించుట నుండి ప్రభుత్వముపై తిరుగబడుటకు నేడు భారతావని సిద్ధంగావుంది. మన కార్యక్రమములో అమిత క్లిష్ట పరిస్థితుల కూడా తల పెట్టితిమి. వీటికి జైలుకు పోవుట సహకారము.

త్రోవ్వకొంది జలమూరునట్లు విధివిరామము లేకుండా జైలుకు తండోపతండలు పోవుచున్న జైలులో పెట్టువారికి చోటుండదు. నిర్వహింపనుతేరు. ఈవిధముగా యేక ప్రవాహముగా బయలు వెడలి పోలీసు జైలు అధికారులకు ఊపిరాడకుండ చేయుట సామాన్య విషయముకాదు. కాని యిదిఫలితముల తెచ్చిపెట్టునంతశక్తి వంతముగానున్నను ముఖ్యతమ

మని గుర్తింతుము. లెక్కలేక ప్రజలను చెరలోవుంచుటచే ప్రభుత్వము నకు, ప్రజలకు సన్నిహితసంబంధము తెగిపోవును. ప్రభుత్వము పూర్తిగా ఆయుధబలముపైననే ఆధారపడవలసివచ్చును. ప్రభుత్వము తన కార్య క్రమమును యథావిధిగా కొనసాగించుకొనలేదు.

జైలుకుపోవుట ముఖ్యోద్దేశముగాక, ముఖ్యోద్దేశముల ఆచరణా ఫలితముగా గుర్తించవలెను. దోపిడీప్రభుత్వముతో చేతులు కలుపుట మనముఖ్యోద్దేశముకాదు. ప్రభుత్వమును స్థంభింపచేయుట కనేకమార్గము లున్నవి. అందు యేదోఒకమార్గములో ప్రభుత్వమును యెదిరింపవలెను. ఏదోఒక సాకుతో ప్రభుత్వమును తిరస్కరింప ప్రజల సమాయత్త పరచ వలెను. వెనుకాముందు తారాడువారినికూడా పోరాటములోనికి లాక్కో వలెను. ఇందుకు తెలివికలవారు ప్రదర్శనములు, పికటింగుమొదలగు వాటికికూడా పోరాటములో తావీయవలెను. ఈ సూత్రములు, వీటి ఆవశ్యకత తర్వాత ఆలోచింతము.

పదునెనిమిదినెలల బహిరంగపోరాటము తర్వాత యేవుద్దేశ్యము తోనైతేనేమి జైలుకుపోవువారు తరుగినారు. దీనికి మనము వప్పుకో వలెను. లేకున్నచో యేదోకొంతచేయువలదా? సంయుక్త రాష్ట్రము ఆర్గనైజర్లు పంపిన కొన్ని అర్జీలు యీ విషయనిరూపణకు యిక్కడ వుదహరించుచున్నాను.

అందొకదానిలో యిట్లావుంది. "కొన్ని జిల్లాలలో సత్యాగ్రహులను గుడ్డలిచ్చుట కేర్పాటు జరిగింది. కార్యనిర్వాహక సంస్థ దెబ్బతినుటవల్ల యెక్కువమందిని జైలుకు పంపలేకపోయాము. ఇద్దరు బనారసులో, ముగ్గురు, సాజీపూరులో మొత్తము అయిదుగురు మాత్రమే పోయినారు" సత్యాగ్రహకార్యక్రమాను సరణము ఖచ్చితమైన తయారిచ్చి, వాలం టీర్లను జేర్పించి సత్యాగ్రహ వస్త్రములు యిచ్చితయారుచేయుట కెన్నో ప్రయత్నములు చేసిరి.

యింకొ రిపోర్టులో యీ విధముగా వుంది. "స్వాతంత్ర్య దినో త్సవమునాడు సత్యాగ్రహముచేయ తలపెడితిమి. వివిధ ప్రాంతముల నుండి యేబది మొదలు నూరు వాలంటీర్లు బాడ్జీలతో ఒక పట్టణమునకు రానేర్పరచితిమి. కాని లాభములేకపోయింది. ఇది పాతవిధముగనే

బాడ్జీలు తగిలించుట, వాలంటీర్లను చేర్చుటఅంతే......పర్యవసానం శూన్యం ”

ఈ పునాదిని మనము గట్టిపరచవలెను. అవకతవకలు చాలా రోజులనుండి జరుగచున్నవి. ఇంక వీటికి స్థానము లేదు. స్వాతంత్ర్య దినోత్సవమునాడు వ్యష్టి సమిష్టి సత్యాగ్రహములు జరుగవలసినదే. ఈ భావము అర్థపూరితము. కాని యేవిధముగా వీరిని తయారుచేయవలయునను పద్ధతిమాత్రం మారాలి.

ఏమో చేయుచున్నట్లు అభినయించుచు మోయలేనిబరువును నెత్తి కెత్తుకొనుచున్నామా? సత్యాగ్రహమునకు ప్రజలను తయారుచేయు వారిలో తరచుకొందరు ప్రచ్ఛన్నులుకూడా వున్నారు. వీరు చేయగల పని చాలా తక్కువ. అవకాశముకూడా తక్కువ. సత్యాగ్రహులు అందరు పోయి పేర్లిచ్చుటకొరకు ఆఫీసుందని యిందువల్ల తలచకూడదు. ఇందువల్లనే యిది దొంగలు దొంగలు ఊళ్లు పంచుకొనునట్లు చాలాగాఢమైన సంబంధ మున్నవారికి మాత్రమే చెందినది. సమిష్టి సత్యాగ్రహమునకు సన్నద్ధమగుట, అచ్చువేయువారు, విధ్వంసక పార్టీల బాధ్యతవంటిది కాదు. సత్యాగ్రహులు పోలీసువారికి తెలుపుకోవలెను. కాన పట్టణ సత్యాగ్రహమునకు తయారుచేసినవారిని త్వరలోనే అరెస్టుచేసారు. ఇంకొకడు అస్థానమెక్కాడు. వానికి అదే గతి. ఇట్లు జరిగిపోయింది. కొన్ని సమయములలో సకాలమునకు వేరొకని యెక్కించలేకపోదుము. ఇతర కార్యక్రమములలో అకస్మాత్తుగా విరుచుకు పడుటకు యెట్టి పద్ధతుల ననుసరిస్తున్నామో, అట్టి పద్ధతులనే సత్యాగ్రహుల చేర్చుటయందు కూడా అనుకరించాలి. ఏ వేషములో వుండనీ, యే బాడ్జీ తగిలించుకొని, హుకుం యివ్వగనే తండోపతండలు జైలుకు పోవుటకు సత్యాగ్రహులను తయారుచేయుటే మన ముఖ్యోద్దేశము. కొంత వుత్సాహముగా వుండుటకు వాలంటీర్లను వీరి మధ్యకు పంపవలెను. ఈ విధముగా ముందుగా తయారుచేసి పేర్లుతీసుకొని, బాడ్జీల నివ్వకుండా పంపుట కష్టమనుట పరిస్థితుల నర్థము చేసుకోకపోవుట. లేకున్న యింత ధనము పాడుచేసి పేర్లు వ్రాసుకొని, అన్నిసన్నాహములు చేసుకొని కొండను త్రొవ్వి యెలుకనుపట్టినట్లు, నిష్ప్రయోజనమగుట యేమి ప్రయోజనము? కొన్ని

సందర్భములలో ప్రజలు వారికి వారు వుత్సాహముతో రాకపోవచ్చును. అట్టిచో పరిస్థితులు వారిచే గుర్తింపచేసి, కార్యాసక్తుల చేయుట మన పని ఈవుద్యోగనిర్వహణముపై వాదవివాదాలు వలదు. ఏ మార్గాన్ని అనుసరించిన మనము సాఫల్యమగుదుమనునది ఆలోచింపవలెను.

ఇట్టివాతావరణము మనమెట్లు సృష్టింపగలము? ముందుగా మనము ప్రజలను కలుసుకోవాలి. ఇందులకు ప్రచారసంఘము వుండవలెను. తీబునుపోకకు మనయిరుగు పొరుగువారు ఒకచోట చేరి ముచ్చటించు కొనునప్పుడు వారి మధ్య చేరి పరిస్థితుల నెమ్మదిగా చెప్పవలెను. కరపత్రములు పంచిపెట్టాలి కూడా విధివిరామము లేక పాటుపడి ప్రజలచే వారి బాధ్యతల గుర్తింపచేయవలెను. ప్రచ్ఛన్నులు దీన్ని అంతా నిర్వహింపలేరు. జైలునుండి తిరిగి వచ్చినవారు యీకార్యక్రమము నిర్వహింపవలెను.

జాతీయచైతన్యము, ప్రభుత్వాన్ని వ్యతిరేకింపవలసినట్టి ఆవశ్యకత ప్రజలచే గుర్తింపచేసి వాస్తవికపరిస్థితులవల్ల కలుగు ఆవశ్యకత చాలతొందరగా నిర్వహింపవలెను. ప్రతినెలలో తొమ్మిదోతేది, స్వాతంత్ర్యదినోత్సవము, జాతీయవారము, గాంధీజయంతి, మున్నగు సమయములందు పదుగురనో, యిరువదిమందినో, ప్రతిజిల్లాలో జైలుకు పంపుచుండవలెను. ఇందువల్ల ప్రభుత్వమును యేవిధముగా వ్యతిరేకింపవలసినది ప్రజలు గుర్తింపగలరు. ద్వేషము సమయకరేకెత్తుచుండును. పల్లెటూళ్లలో ధాన్యపుడిపోలముంకు "ముందు గ్రామికులకు కడుపునిండా కూడు చూపి తర్వాత యెగుమతి చేయండ"ని పికిటింగు చేయుట చాల ముఖ్యావసరం. ఇదే విధముగా పట్టణములో యుద్ధపాక్టరీలముందు, రిక్రూటింగు ఆఫీసులముందు, ప్రభుత్వషాపులముందు చేరి "ధాన్యము చవుక ధర"కని పికిటింగు చేయవలెను. ఇందువల్ల మనము చాలా మంచి ఫలితముల పొందగలము.

ఈ ఆశయముతో ప్రతినెలలో, వారికివారు వుద్రేకులై బయటకు వచ్చువారిని జిల్లాకు పది లేక యిరువదిమందిని పంపటానికి 250 జిల్లాల లోను, ప్రయత్నముచేయాలి. మొదటి నెలలో మనము విఫలులము కావచ్చు. నిరుత్సాహపడక కార్యసాధకులమగుటకు పట్టుబట్టి పనిచేయ

వలెను. బ్రిటిషున్యాయస్థానములలోకి, కేంద్రములలోనికి జాతీయ జండాలను తీసుకొని తమకుతాము ఉద్యుక్తులగు వర్కర్లు పరుగిడవలెను. అప్పుడు బ్రిటను మనస్వాతంత్ర్యమును బంధించిన త్రాడులను తెంపివేయగలుగుటకు సదవకాశము ఏర్పడును.

ఒకరిపోర్టులో యీ విషయముగా చదివితిని.. ది 26వ తేదీని మనము గుర్తించవలెను. మనము చేసిన ప్రయత్నముల కన్నిటికి యీ దినము పరీక్ష సమయముగా గుర్తింపవలెను. మేము స్వాతంత్ర్యులమని చాటుకొనుటకన్న ముఖ్యమైన జన్మహక్కు, మనకింకొకటిలేదు. ఇదేముఖ్యమార్గము మనము స్వాతంత్ర్యమని జబ్బచరచవలెను. ఇది మనకు గంభీరమైన శక్తినీయకలదు. ప్రతిదినము మన కార్యక్రమమును యెంతవరకు నిర్వహింప గలిగితిమని పరీక్షించురోజుగా మనమనస్సులలో హత్తుకొనిపోవలెను. ప్రతిదేశమును కూడయుద్ధభూమిలో పోరాడుటకు వేనకువేలు సిపాయీలను పంపగలుగుచున్నది. నిరంకుశ ప్రభుత్వము మనపై మొత్తుచున్న న్యాయశాస్త్రముల తిరస్కరింప యీ విధముగా వాలంటీర్లను జైలుకుమాత్రము పంపలేమా? ఆకలిమంటలో. నిరాశతో, నిస్పృహతో విదేశప్రభుత్వము మనల బాధించుచుంటె సహించి జీవన్మృతులమువలె బ్రతుటకన్న, స్వాతంత్ర్య కాంక్షకు దేశ దాశ్యవిమోచనమునకు వచ్చు కష్టములను. సహించి జైలుకే వెళ్లుట వేయిరెట్లు ఉత్తమముగదా? ఇది మనకు పరీక్షాసమయం. తమకు తాముగా బయలుదేరి బయటనుండి అనుభవించుచున్న కష్టములలో వెయ్యోవంతు కష్టమును అనుభవింప యెంతమంది సన్నద్ధముగా వున్నారో చూచుటకిది పరీక్షాసమయం. ఈ సంఘటనముందు తత్తరపోయి వెనుకంజ వేయకూడదు. మనము ప్రజాహృదయములలో జాతీయ వాదమును నూరిపోయవలెను. స్వాతంత్ర్యావశ్యకత గుర్తింప చేయవలెను. వారి భావములు బలపడవలెను. మర్యాధ మట్టిలేక మనల బాధించు మాజస్ట్రేటు యెచ్చట జాతీయజండాను పాతవద్దని అడ్డుపెట్టాడో అక్కడనే పాతవలెను. బీదరైతునోట మన్నుగొట్టి తోలుకొనిపోవు ప్రతి ధాన్యపుబండిని ఆపవలెను ప్రజలలో యింతచైతన్యము గలుగ చేయాలి. ఇంతచేసినగాని ప్రతి నెల తొమ్మిదో తేది నిర్భీతిగా ప్రభుత్వమును తిరస్కరించుటకు శక్తిచాలదు. అచంచల విశ్వాసముతో మనము అమితమైన బలము చేకూరువరకు పాటుపడవలెను.

# 4. విడుదల ఖైదీలు

విడుదలైన ఖైదీలు, వారినే ఉదాహరణముగా చూపి: ప్రజలప్రోత్సహించి యేవిధముగా కార్యనిర్వహణము కొన సాగించవలెనో, యింతకు ముందే ఆలోచించాము. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్య పోరాటమునకు అనేక ప్రతిబంధకశక్తులు మనల బాధించుచున్నవి. ప్రతివాడును కొన్ని వేల కాంగ్రెసు వర్కర్లదే యీబాధ్యతయని, మిన్నకుంటున్నాడు. జైలు నుండి బయిటకురాగానే మరల జైలుకుపోవుట వారిబాధ్యత మాత్రమే నని తలచుచున్నారు. ఇందువల్ల మరల జైలుకుపో వెనుదీయు చున్నారు. నారిపనిని సమర్థించుకో అసమర్థ ప్రచారమును లేవదీయు చున్నారు. జైలుకుపోయి యెన్నో బాధలుపడికూడా వారుచేసిన పనినివారే నిందించుకొనుట హాస్యాస్పదము. విడుదలైన వర్కర్లు తనవైపు వ్రేలుపెట్టి, యేమిమరల జైలుకు పోలేదని వెక్కిరించిన వానిని ఒకప్రశ్న వేయవలెను. "నేను వొకసారి నాబాధ్యత నిర్వహించాను. మరల నిర్వహించుటకు సన్నద్ధమగుచున్నాను. ఈమధ్య విరామములో నీవెందుకు తయారుగా వుండకూడదు" అనిగద్దించి ప్రోత్సహించ వలెను.

సంయుక్త రాష్ట్రములో ఒక మాజీ పార్లమెంటరీ సెక్రెటరీ వున్నాడు. జైలుకుపోయివచ్చాడు. బహిరంగ పోరాటము ప్రారంభింప వలసివచ్చిన అవశ్యకత మరచి నిరుత్సాహపడెను. ఇంత కష్టనష్టములు పడ్డందుకు పర్యవసానము గుర్తింపలేకపోయెను. ఏదో వెనుకటి పరిస్థితులతోనే సంతృప్తిపడుటకు, కాల విలంబనమునకు అవక తవక ప్రచారము ప్రారంభించెను. ఇంతకన్న తన్నుతాను వెక్కిరించుకొనుట వేరొండు కలదా ? విడుదలైన వర్కర్లలో యిట్టివాడు యొక్కడనో ఒకడు బయటపడుచుండును. ఈ మహామహుడు కాంగ్రెసులీగు ఐక్యతకావలెనని చెప్పుచున్నాడు. అది నిష్ప్రయోజనమని యేనాడో గ్రహించాము. ఈ విషబీజము బ్రిటను. హిందూ-మహమ్మదీయులు. అనుమాలలుగల త్రికోణముపైన ఆటాడుచున్నది. ఈ త్రికోణమునుండి బ్రిటనును నెట్టివేయనిది, హిందువులు, మహమ్మదీయులు ఒక గీతమీద నిలుచోలేరు. అంత వరకు ఆ గీత రెండుచివరల నిలుచోవలసిందే. ఇది మనము యెప్పుడో తెలుసుకొంటిమి. దీనిని గురించి మరల మనము తెలుసుకోవలసిన అవశ్య

శత లేదు. బ్రిటను వున్నంతవరకు నిజాయితీ అయిన ప్రతి కాంగ్రెసు వర్కరు యెంతవరకు సాధ్యమైతే అంతమంది ముస్లిములను పోరాటములోకి దింపవలెను. ఇది వుమ్మడి బాధ్యతగా గుర్తింప చేయవలెను.

ఒక లక్షా యేబది వేలకు పైగా కాంగ్రెసు వర్కర్లు విడుదలై వున్నారు. వీరందరు పోరాటములో దూకిన వీరాధి వీరులు. వీరి మాటకు యెంతైనా విలువవుంది. ఇది వీరు గుర్తించాలి. వీరు శలవుపై వున్న సైనికులు. వార్లు చేసిన అద్భుతకులు ప్రజలకు చెప్పవలెను. వారు వారి పైనవున్న బాధ్యత గుర్తింపవలెను. ప్రజలచే గుర్తింప చేయవలెను. ఇదంతయు మరచిపోయి జైలులోకి పోవుట వచ్చుట వారి విధిగా భావించుచున్నారు. బాగుగా అలసిపోగానే వెనుదిరిగి పోవుచున్నారు. ఇది అవివేకము. నిరంకుశ ప్రభుత్వ విధానమును తిరస్కరించుటకు కొత్తవర్కర్లను సన్నద్ధపరచుట వారి విధిగా భావించవలెను. జైలుకు పోకుండా బయటనే వుండి నిరంకుశాధికారాన్ని నిరసించుటకు యేయే మార్గాలున్నవో అవి ప్రజలకు బోధపరచుటకూడా వీరి విధియై యున్నది. చరసాలకు పోకనే శత్రువుతో పోరాడు అవకాశాలు సామాన్య ప్రజలకు బోధించాలి

## 5. సమిష్టి అసహాయోద్యమము

అసహాయోద్యమపు ఆవశ్యకతను గూర్చి మనము కొంత నేర్చుకోవలెను. బాగుగా అర్థము చేసుకోడానికి ప్రభుత్వసలహాదారుడు సంయుక్త రాష్ట్రములో అమలు జరిపిన యీ క్రింది డిక్రీలే వుదాహరణం.

ఇందు ముఖ్యముగా అన్నిరాష్ట్రముల ప్రభుత్వములు అమలు జరిపిన డిక్రీలనే తీసికొనుచున్నాను. ఈ ప్రభుత్వసలహాదారుడు యీ విధముగా ఉత్తర్వుజారీచేసెను. "కూడబెట్టుడు" అను ప్రచారముతో యుద్ధ రుణపత్రములు, సర్టిపికేట్లు విక్రయించి యెనిమిదినెలల్లో యెనిమిదికోట్లు నేకరించాడు. వినోదవాహ్యాళి పన్ను నూటికి నూరుపెంచిరి. కోర్టు ఫీను స్టాంపుడ్యూటీ నూటికి యిరువది అయిదుపాళ్లు పెంచిరి. (ఇవి ఒకకోటి రూపాయిలు) నీటి కాలువల క్రింద సాగు హెచ్చుతగ్గులను సవరించుటకు చాలా భూముల శిస్తులను పెంచిరి. చెరకురైతుల నిర్బంధపరచి చెరకు ఆదాయములో కొంత యుద్ధరుణపత్రముల క్రింద జమకట్టిరి. (మణుగుకు

రెండణాల లెక్కన రెండుకోట్లు) బెల్లము, నూనె, నూనెవిత్తులు, ఆహార ధరల కంట్రోలు యింకొక తరగతి (బెల్లము యెనుబదియారు లక్షలకు కొని నూట పందొమ్మిది లక్షలకు విక్రయించి నూటికి నలుబది వంతున లాభముపొందిరి. సంయుక్తరాష్ట్రములో 1943 అక్టోబరు నాటి ఆహార వస్తువుల నిల్వఖరీదు 82 కోట్లు) ఈవిధముగ యెన్నోరీతుల దోపిడి ప్రారంభించారు.

జైలుకు పోకుండా నిర్వహింపగల కార్యక్రమమేదైన కలదా అని కొందరు ప్రశ్నింతురు. స్వతహాగా బ్రిటిషు పరిపాలకులే అట్టి అనకాశము లను కలుగచేయుచున్నారు. "కూడ బెట్టుడు" అని చేయు ప్రచారమును గూర్చి మన మాలోచింతము. పెద్దపెద్దమొత్తాలు యీవిధముగా ప్రభుత్వ మునకు వచ్చుచున్నవి. భాగ్యవంతులు వారి కార్ఖానాలైనారు. వీరిలోని అత్యాశనుగాని, ప్రభుత్వపు వొత్తిడినిగాని యెదిరింపగలశక్తి ప్రజల కింకను లేదు. పోలీసులకు చిన్నచిన్న వర్తకులు, కర్షకులు కొంత యిచ్చు చున్నారు. బలవంతంగా లాగుకొంటున్నారుకూడాను. దీనిని ఒకసారిగా మనము ఆపలేము. భయపెట్టి పీడించి ప్రభుత్వము ప్రజల దోచు కొంటుంటే మనము ఊరుకోలేము. పోలీసు యెర్రటోపీ చూడగనె బెదరి భయపడనవసరములేదని ప్రజలకు బోధించాలి. ప్రజలకు ఉద్రేకము చైతన్యం కలిగించి సమయము కలిగించి సమయము దొరికినపుడు తిరస్క రింపచేయవలెను. మనము యిచ్చుచున్న బహుమతులు యిష్టముండి యిచ్చు చున్నామని ప్రభుత్వప్రచారము వీనిలో పోస్టలు సేవింగ్సు పత్రములు, లాటరీ టిక్కెట్లు పాటకచ్చేరీలు, ఆటలు, పందెములు చేరును. ప్రభు త్వమునకు యీబహుమతులు, ఋణములు యిచ్చుట మన ఆధీనములో వుంది ప్రపంచజ్ఞానముగల వారందరును తమ యిరుగు పొరుగు వారలనంద రను యీలాంఛనముల నిరాకరించి స్వాతంత్ర్య ప్రతిబంధకముల వ్యతి రేకింప సన్నద్ధుల చేయవలెను.

మననెత్తురును పీల్చి బ్రతుకు ప్రభుత్వమునకు వినోదవ్యాపార్యాళి పన్నులు యెక్కువ ఆదాయము నిచ్చుచున్నవి. ఇవన్నియు మనము యిష్టముండి యిచ్చినవే పుచ్చుకొందురు. చట్టబద్ధముగా గాని బలవంత ముగా గాని నెత్తినరుద్దునవికావు. పన్నువేసిన అన్నము తినకతప్పదు. ఇది బ్రతుకుట కాధారము. సినిమాలు పందెములు ఆటలు, నాట్యములు

మొదలు గాగల వినోదములు లేకున్నను మనము బ్రతుకగలము. జాతీయ పోరాటము సాగుచున్నన్నిదినములు వినోదములకు పన్ను కట్టకుండా యేర్పాటు చేసుకోడం ప్రతివాని బాధ్యతై యున్నది.

వేనకువేలు లక్షలకు లక్షలు ధనము అధికలాభములపొందు భాగ్యవంతులు కట్టుచున్నారు. మనమే కొద్దివందలో లక్షలో తిరస్కరించిన మాత్రమున ప్రభుత్వానికేమి కొరతని అనుకోరాదు. జాతీయ పోరాటమున కాధారము వేళ్లపై లెక్కింపగల యీభాగ్యవంతులుగారు విశాల ప్రజానీకమే జాతీయ పోరాటమునకు వెన్నెముకని మనము గుర్తింపవలెను. చాల జాగ్రత్తగా ఆలోచించి బీదలనక భాగ్యవంతులనక ప్రజాసమిష్టివద్దనుండి కొద్దిగనో గొప్పగనో ప్రభుత్వము పన్నుల గుంజుకొంటున్నది. ఇదే మనకు మార్గదర్శి. యిది చిన్నదెబ్బ, యిది పెద్దదెబ్బ అని వెనుకాముందాడక జాగ్రత్తగా ఆలోచించి ప్రభుత్వముపై సమయము దొరికినపుడెల్ల దెబ్బతీయవలెను. బ్రిటిషు సాలీడు భారతదేశముపై గట్టిగ గూడుకట్టుకొని నివసించుచున్నది. ఎప్పుడే సమయములో యే అవకాశము దొరకునో రెప్పవాల్చక, ధృడసంకల్పులమై, విసుకు విరామము లేక కనిపెట్టి యీగూటి ప్రతిపోగును ఛేధింప కృతనిశ్చయులము కావలెను. నిరంకుశ ప్రభుత్వము దోచుకొను యీపన్నులు దోపిడీలు, స్వార్థపరాయణతతో రకరకముల పురుగుల దిగమ్రింగి అల్లుకొన్న సాలీడు గూటి దారములవంటివి. స్వాతంత్ర్యేఛ్చ క్రమక్రమముగా నశించుటకు ప్రభుత్వము పన్నుచున్న వలలే యీపన్నులు.

విదేశ ప్రభుత్వమునకు పన్నులుకట్ట నిరాకరించుట ఇదివరకెన్నడో అసహాయోద్యమములో చేర్చబడినది. కాని యిన్ని సంవత్సరములుగా మనము దీనిని పూర్తిగా నిర్వహింప లేకున్నాము. ఈ బాధ్యత కాంగ్రెసు వాదులది పోరాట సమయములో వీరు బోధించున వన్నియు పోరాటము కొంచెము చల్లబడునపుడు ప్రజలకు బాగుగా నాటజెప్ప మరచి పోవుచున్నారు. ఈ న్యాయశాస్త్రము విదేశ ప్రభుత్వమునకు చెందినది. అందుచే ఈ న్యాయశాస్త్రములు మనలోని స్వాతంత్ర్య పిపాసతను జాతీయ గౌరవమును త్రొక్కి పెట్టుట కేర్పరచిన కుతంత్రములుగా గుర్తించాలి. ఇది మనదేశములోని ప్రతి బస్తీ, పల్లెటూరి పామరుడు గుర్తింపవలెను. ఈ న్యాయశాస్త్రపు తీర్పులను పోవమానివేయ వలెను.

తగాదాల తీర్పులు పంచాయతీలలో పరిష్కారము చేసికొని కట్టుబడవలెను.

ప్రజలు పురాతన పద్ధతుల ననుసరించిన ప్రభుత్వపు సుంకమును కొన్నికొన్ని విషయములలో తగ్గింపవచ్చును. మనము చెరకును గానుగాడి నాటుచక్కెరను చేసుకోవచ్చును. ఇట్టివె యింకను కొన్నిగలవు. మన చేతనైనంతవరకు ప్రభుత్వమునకు పన్నులుకట్ట మానివేయవలెను. చెరకును మనము స్వంతముగా గానుగాడుకొనుటచే మనము సుంకముకట్ట మానివేయగలము. ఇందువలన చెరకు ఖార్ఖానాలు మూతపడును. పర్యవసానము ప్రభుత్వమునకు రాబడి పన్నుకూడా పోవును. ప్రభుత్వమిప్పుడు మనపై క్రొత్తరకపు పాలసీలను రుద్దుచున్నది. మన ఆహారవ్యాపారము, మొత్తమునే తన కబ్జాపెత్తనము క్రిందకు తీసుకొన్నది.

చక్కెరవ్యాపారములో సంయుక్త రాష్ట్రప్రభుత్వ మేవిధముగా నూటికి నలుబది వంతున గుంజుకొనుచున్నదో ఇంతకుముందే పరిశీలించతేము. ఒక సంయుక్తరాష్ట్రమేగాదు. ప్రతిరాష్ట్రముకూడా ఆహారపదార్థములను అజమాయిషీలో బెట్టి విపరీతలాభముల బొందుచున్నది. ఇవన్నియు ఢిల్లీలో కూర్చొని ప్రజలకు తెలియకుండా దోచుకొనుటకు పాటుబడుచున్న మేధావుల తెలివితేటలు ఇందువల్ల ప్రతివాడు ప్రభుత్వమునకు కొంత సుంకము చెల్లింపవలసిన ఆవశ్యకత యేర్పడుచున్నది. వ్యాపారములలోయున్న మధ్యతరగతివారికి కొంత లాభములజూపి చిచ్చుకొట్టుచున్నారు. బస్తీలోనున్న బీదవానికి వ్యాపారస్తునికి మధ్యపోరుపులు రేపుచున్నారు. దేశము మొత్తమును ఆహారముకొరకు పాకులాడజేసి స్వాతంత్ర్య పోరాటమునే మరచిపోవునట్లు జేయుచున్నారు. ఇదంతయు అమిత తెలివితేటలతో చేయుపని కాదా?

వ్యాపారస్తులు, గుమాస్తాలు, ఉపాధ్యాయులు, యీ కుతంత్రమును గుర్తెరుగవలెను. జాతీయపోరాటమునకు వీరే పట్టుకొమ్మలుగాన వీరిని మభ్యపరచుటకే ప్రభుత్వము ఈ వలలన్నియు పన్నుచున్నది. వ్యాపారమును క్రమేపి బ్రిటిషేతరులవద్దనుండి ఒకవైపుగుంజివేస్తూ రెండవైపు నాణెములను దాచుకొనినందులకు విపరీతశిక్షలు వేయుట వీరుగాకున్న యింకెవ్వరు సక్రమముగా నర్థముచేసుకోగలరు? ఇది మధ్యతరగతులవారు

బాగుగా గ్రహించవలెను. వారు బాగుపడుచు బీద, సాదా, హాయిగా బ్రతుకునట్లుచూడ నడుముకట్టవలెను. పల్లెటూరు పల్లెటూరునకు మధ్య వస్తువుకు వస్తువు మారకముజరిపి స్వాయంపోషకముగా జేయుప్రతినిధు లుగా పరిణమించవలెను. అప్పుడు పల్లెటూరి చేతిపనులుగూడా అభివృద్ధి పొందును. మిగిలినవారిని జాతీయపోరాటములలో యేదోఒక నిర్ణీత కార్య క్రిమమును కొనసాగించుటకు సన్నద్ధ పరచవలెను.

దొంగనిల్వలజేసి, అధిక లాభముల సేకరించు వారిని నిర్మూ లింపవలెనను ప్రభుత్వ ప్రచారములోనియదార్థములు శ్రామికులు గ్రహింపవలెను. అత్యధికముగా దొంగనిల్వలజేసి అధిక లాభములు బొం దుచున్నది ప్రభుత్వమేనని గ్రహింపవలెను. ఆహార పదార్థాల నియమ ములు, రేషనింగు, ప్రభుత్వము ద్రోహ బుద్ధితో దోచుకోడానికి పన్నిన వలలు. ఇందువల్ల ప్రతివానివద్ద యుద్ధమునకు సుంకము కట్టించుచున్నది. బస్తీ బీదలకు అర్ధకూడే పెట్టుచున్నది. వీరిలో ఆకలిమంట నాపునట్టి అవకాశము లేకుండా చేసినది. ఇది ప్రజలు గ్రహింపలేక వారినివారే అవినీతికరముగా నిందించుకొనుచున్నారు. కాంగ్రెసు పురపాలక సంఘము లిది గ్రహించాలి దీనికి రేషనింగు పెట్టిదానిని అజమాయిషీలో వుంచమని చెప్పుట ప్రభుత్వ యుద్ధమునకే సాయముచేయునట్లగును. బస్తీలబీదలు నిదురపోకూడదు. ప్రభుత్వము నిల్వల స్వాధినముచేసుకోనుటకు బలము సంపాదించాలి. తరచు జైలుకు పోవలసివచ్చిన జంకకుండుట, అవసర మైన చోట ప్రదర్శనముల చేయుట, ప్రారంభింపవలెను. అజమాయిషీలు, రేషనింగులని ప్రభుత్వము చేయు దొంగదోపిడివి అరికట్టవలెను. పల్లె టూరి చేతిపనుల ప్రోత్సహించుట, పల్లెటూరు పల్లెటూరు మధ్య స్వాయం పోషణకు మారకములు జరుపుట ముఖ్యావసరము. దీనినిగూర్చి పూర్తిగా ఆలోచించుటకు ముందు, మనకుపకరించు పరిస్థితులు యింక కొన్ని ఆలో చింతము.

ప్రతినెల తొమ్మిదో తేదీ మన ధైర్య సాహసములకు పరీక్షా దినముగా గుర్తించాలి. ఈ రోజున నిరంకుశ ప్రభుత్వము నెదుర్కొనుట ముఖ్యావసరము. నిరంకుశ ప్రభుత్వమును బహిరంగముగా తిరస్కరింప లేనివారు తమకేవిధమైన నష్టము వాటిల్లకుండా చేయగల కార్యక్రమము కూడా చాలా కలదు. ఈ రోజునే పోస్టాఫీసు, రైల్వేలు టెలిగ్రాపు ఆఫీ

నులను నిషేధింపవలెను. ఇంతటితో యివి పనిలేక మూసివేయబడును. ఆహారోత్పత్తినంతా ప్రభుత్వపు చేతిలో పడకుండా చూడాలి. సివిలు పాలన మొదలగు కీలకముల మూలమున ప్రభుత్వము మన నెత్తురు యెల్లా పీలుస్తున్నదో ప్రజలకు బోధపరచవలెను. వైజ్ఞానిక సమావేశములు జరుపుచు ప్రజలకు వాస్తవికపరిస్థితులు బోధింపవలెను. తమంతటతాముగా ప్రభుత్వమును వ్యతిరేకించి తిరస్కరించుట బహిరంగ పోరాటమునకు చేయూతనిచ్చుట. అప్పుడే నిరంకుశమగు ప్రభుత్వమును నిరాయుధులగు ప్రజలు యెదిరించి విధి విరామము లేక వెన్నంటి బాహాబాహీ పోరాడ ధైర్యము కలుగును. ఈ విధముగా ప్రజలకు బోధించుచు చేకూరిన బలముతో ప్రతినెల తొమ్మిదవతేదీ కార్యక్రమ సాధనకు పూనుకోవాలి.

విద్యార్థులు పాఠశాలలకు పోకుండుట కూడ బహిష్కరణోద్యమములో ఒకభాగము. సాధారణపరిస్థితులలో సమ్మె చేయుట సాధ్యము కాదు. జాతీయ పోరాటములో ఒకభాగము విద్యార్థోద్యమము కాని యీయువకబృందమునకు కూడ నిర్మాణయుత సంస్థలేమిచే స్వాతంత్ర్యోత్సాహము కుంటుబడియున్నది. ఇది మన దురదృష్టము ఇంతమాత్రముతో పోయిన ఉద్యమములో విద్యార్థులు పాల్గొనలేదని చెప్పకూడదు కొన్ని కొన్ని ప్రాంతాలలో వారెముందుకు దూకి పోరాటాన్ని సాగించారు. కాని మధ్యలోనే సమ్మె చెదిరిపోయింది. ఈపొరబాటు మరల జరుగకూడదు. ప్రజలు వెనుకాముందాడిన ఆడుదురు గాక. విద్యార్థులు పోరాటములో ముఖ్యపాత్రనిర్వహింపవలెను. మనదేశమునందలి పోరాటములో సైన్యాధిపతుల బాధ్యత వీరు నిర్వహింపవలసివుంది. సాధువులు, ఫకీరుల వేషముల ధరించి, స్వాతంత్ర్యపోరాటము ముమ్మరముగా సాగునపుడు ఒకచోటనుండి ఒకచోటకు వార్తలు నడుపుచు, ప్రజలలో ఉద్రేకోత్సాహములు ద్విగుణీకృతముచేయుచు, విజయసాధనకు తోడ్పడాలి. దీనికి కొన్ని ఉదాహరణల నిచ్చుచున్నాను. పోరాటము సాగునపుడు జీవితములో అనేక క్రొత్తత్రోవలు తొక్కవలెను. విప్లవవిద్యార్థులు ఫాక్టరీ కూలీలగా పల్లెటూరి కూలీలగాచేరి వివిధముఖముల పోరాటమునకు యెందుకు చేయూత యివ్వకూడదనుచు నన్ను కొందరుచైనా విప్లవకారులు ప్రశ్నించారు. ఇది విప్లవమునకు చాలకష్టతమమైన త్రోవ.

కాని యిదే, కష్టములకోర్చి, విప్లవవిద్యార్థులు అనుసరింపవలసిన త్రోవ. విద్యార్థియువకులు యీతూరి కాలేజీలలో విజయవంతముగా సమ్మె చేయుటకు వారిని వారే తయారు చేసికొన వేడెదను. ముఖ్యముగా కాలేజీ విద్యార్థులలో చైతన్యము కలిగించుటకే నేనిది వ్రాయుచున్నాను. వారికి వారే తయారగుచు సమయము దొరికినపుడెల్ల ప్రజలలోకి పోయి, మనము నిర్ణయించుకొను వివిధ కార్యక్రమములను కొనసాగించి చైతన్యము తీసుకొనిరావలెను. సంఘీభావములేక, ఆర్థికముగా దౌర్భాగ్యస్థితిలో వున్న యీదేశములో తప్పక వీరుముందంజవేయవలెను. జీతము భత్యము లేని సైన్యాధిపత్యమే గదా యిదని నిరాకరింపరాదు. దేశదౌర్భాగ్యావస్థ చూచినచో మనము పదుశ్రమ తృణప్రాయముగా భావింపగలము. ఇన్నికష్టములకోర్చి, దారిద్రొంక లేని అభేద్యమైన యీమార్గమున నిర్భీతిగా వెనుకడుగువేయక ప్రజలను మనమునడిపింపగలిగినపుడే విజయడోలికలలో ఊట్టూతలూగగలము. విజయదుంధుభుల మ్రోగించగలము. స్వాతంత్ర్యాన్ని అనుభవింపగలము.

బహిష్కార జోద్యమానికి కాంగ్రెసు చూపిన వివిధ మార్గములలో విదేశ వార్తాపత్రికలను బహిష్కరించుట కూడా ఒకటి. దీనిని పూర్తిగా కొన సాగింపలేక పోవుటకు ముఖ్యముగా మనరాజకీయ జీవితములో రెండు లోపములున్నవి. ఒక కార్యక్రమమును తీసుకొని దానిని చివరంట సాధించుట మనకు తెలియనే తెలియదు. ఈ అసమర్థత్వము వలన యేకార్యక్రమమును కొనసాగించలేక ఓడిపోయామని బిక్కమొగము పెట్టుదుము. వార్తాపత్రికల విషయముల నాలోచింతము. స్టేట్సుమెన్, టైమ్సు ఆఫ్ ఇండియా, పయనీరు, పీపిల్సువారు, పత్రికలున్నవి. ఇవి మనజాతీయ పోరాటమార్గ పురోగమనమును అభ్యంతర పరచు గుడ్లగూబలు. అసహాయోద్యమమును నిర్వహింపబూను యూనిట్లు, విక్రయదారులు, ప్రకటనదారులు, అమ్మకపుదార్ల పేర్లు తీసుకోవలెను. విధివిరామము లేక వీరందరి వద్దకుపోయి, పరిస్థితులు బోధించి యీపత్రికలు నామరూపములు లేక నశించి పోవునంతవరకు నిదుర పోకూడదు. తగుల బెట్టుట బజారుల వెంబడి వూరక అరచుట; పత్రికలకు స్టేటుమెంటు లిచ్చుటవలన యేమియు ఫలితము లేదు. ఈ పత్రికా బహిష్కరణమునకే కాదు యేవిషయమున

నైకైనను పెద్దయెత్తున ప్రచారము చేయుటకన్న ప్రతిమానవుని వద్దకు వెళ్లి వాస్తవికత గుర్తింపజేసి చైతన్యము గలిగించుట చాలా ముఖ్యావసరం.

## 6 ధాన్యము చరఖా

కూడు గుడ్డ విషయములో దెబ్బతినకుండ మనలను మనము పోషించుకొనుట ముఖ్యావసరము. ఇది అసహాయోద్యమమునకు ప్రాణమువంటిది. నేతమిల్లులగూర్చి యిచ్చుటకొంత చర్చింతము. ఏ సైన్యములు మనల నిర్బంధింప నియమింపబడినవో వాటికి యీ మిల్లులుగుడ్డ తయారుచేసి యిచ్చుచున్నవి. మనసెత్తురుపీల్చి బ్రతుకు ప్రభుత్వమునకు అధికలాభములు సేకరించి కోటానుకొట్లు పన్నుక్రింద చెల్లించి బలపడ సాయపడుచున్నారు. పల్లెటూరు పట్టణమునకు ముడివేసి బ్రతుకుటకు సామ్రాజ్యవాదులకు తోడ్పడుచున్నారు. గుడ్డనుస్వయముగా తయారుచేసికొని యీ ఫాక్టరీలవద్ద కొనుటమాని మనపల్లెటూళ్ళు నివసింపగల్గినచో వారు కాయకష్టముచేసి పండించు ధాన్యమును విక్రయింపవలసిన అవసరముండదు. అధికభాగము అనవసరముగా విక్రయించుట తగ్గింపవచ్చును. అప్పుడు పల్లెటూరు, బస్తీలకు ముడివేసికొనుచుకొని బ్రతుకు పరప్రభుత్వపుటాశ అడియాశ చేయవచ్చును. దేశము క్షుద్బాధనుండి తప్పించుకొని సుఖముగా మనగల్గును.

సామ్రాజ్యవాద ప్రభుత్వము పల్లెటూరు పట్టణములను జోడించి వేసినముడిని త్రెంపగల్గిన, కరువుబానిసత్వమును పారదోలగల్గుదుము. పల్లెటూరు స్వయం సమృద్ధిగావుండి పాటు బడవలెను. సాధ్యమయినంతవరకు పశువులు పాడిపంటలను అమ్ముటమానివేయవలెను. దేశములోని చేతిపనివారికి చిన్నరైతులకు, వ్యవసాయ కూలీలకు అర్ధభోజనము పెట్టుటవల్లనే యీ ఆహార కరువువచ్చినది. యీఅర్ధభోజనముల !నరికట్టాలి· గ్రామపెద్దలపైన కాంగ్రేసువాదులపైనా దీని బాధ్యత ఉన్నది. పల్లెటూరి ప్రజలందరు ఒక యేక కుటుంబములోనివారని, సోదర సోదరీమణులని వారికి బోధించు బాధ్యత వీరిదే. గ్రామస్థుల అందరి కడుపు నిండిన తదుపరే అమ్మవలెనని నచ్చచెప్పవలెను. గ్రామములోని బీద సాదకు, పారిశ్రామికునకు, కూలీకి, కడుపునిండా అన్నముపెట్టిన వీరందరిచే సమిష్టిగా యెక్కువ పని చేయింప గల్గుదుము. వీరందరి సహాయముతో యెక్కువ నూలు వడకి యెక్కువ బట్ట తయారు చేయింపవ

చ్చును. గుడ్డ విషయములో పల్లెటూరు బస్తీలతో యెట్టి సంబంధమును పెట్టుకోకూడదు. పల్లెటూరి వడ్రంగులు చరఖాలను తయారుచేయవలెను. చిన్న భూస్వామి, కూలీల కుటుంబములు వడికి నేయవలెను. దీనిని వృత్తిగా పోషింపవలెను. వడుకుటకు కొన్నిచోట్ల దూది తక్కువ పండ వచ్చును. కాని కొన్నిచోట్ల యెక్కువ పండుచున్నది. కొన్ని పల్లెటూళ్లు ఒక కూటమిగా కలసి యెక్కువ తక్కువలను సరిచేసుకోవలెను. వస్తువుకు వస్తువు మారకము వేసికొనుట వృద్ధికావలెను. (సాటావ్యాపారం. Bartee Trade) బావులు త్రవ్వుటకు, చెరువు కట్టలు వేయుటకు, యింకా యితర గ్రామీణ సౌకర్యములకు పల్లెటూరి బీదా సాదా బాగుగా నుపయోగించెదరు.

ఈ బ్రిటిషు ప్రభుత్వములో మానుషత్వమే నాస్తి. దయాదాక్షిణ్యములతో దేశమును ఆకలిమంటలనుండి తప్పించుట కూడ సహింప లేదు. ఎవరైన అట్టివారు మాటాడిన బంధించి జైలులో పెట్టును. ఊరక అనవసరపు బాకాలూది వట్టి ఆర్భాటము చేయుటకన్న గ్రామీయ పెద్దలు, కాంగ్రెసువాదులు గుప్పు చప్పుగా పనిచేయుట నేర్చుకోవలెను. అప్పుడు యీ పోలీసు బలగము లేమిచేయలేవు. అప్పుడు బల వంతముగా బలప్రయోగముతో, ఆహార పదార్థాలను తీసుకొను టకు ప్రభుత్వము ప్రయత్నించును. దీనిని మనము ఆపజాలము. దోపిడీ ప్రభుత్వము చూపుడబ్బుకు ఆశపడిగాని, పోలీసు బలప్రయోగమునకు వెరచిగాని ముందుగనే సర్వస్వము సమర్పించుట మానవలెనని మన పల్లె టూరు పౌరులకు విన్నవించుచున్నాము. మనము బుద్ధిపూర్వకముగా యచ్చుటకును, వారు బలవంతముగా దోచుకొనుటకును సహాస్రము తేడాయున్నది. ఇట్టి సమయములో రైతుయువకులు విధ్వంసక యూని ట్లుగా బయలుదేరి నిర్ణీతకార్యక్రమములను అమలు పరచి పోలీసు బలగ ముల నిర్వీర్యము చేయ పాటుబడవలెను.

గాంధీజీ స్వయంసంవృద్ధి సూత్రమును విపులీకరించి చెప్పుటే యీ ప్రణాళికయొక్క ముఖ్యోద్దేశము. యుద్ధప్రారంభమునుండి కూడా మహా త్ముడు యిది నొక్కినొక్కి చెప్పుచున్నాడు. కరువు బానిసత్వములను పారద్రోలుటకిదే తరుణోపాయమని ఉద్ఘాటించుచున్నారు. చాల అవక తవకలుచేసి కాంగ్రెసు యీమార్గాన్ని అనుసరింపలేక పోయింది. దేశ

ములో యీ చైతన్యమును కల్పింప పాటుబడవేలేదు. బహిరంగపోరాటములో చేకూరిన అనుభవములను గుర్తించి, విప్లవకారులు ముందు యీ కార్యక్రమానికి ఒడికట్టుకోవలెను. కరువువల్ల గల్గిన అరాజకమును గుర్తించిన దయాదాక్షిణ్యాలు కూడ యీపనికి పూనుకోవలెను. గత నిరాయుధ విప్లవము మానవజాతికి క్రొత్తపంథాను చూపినది. చరిత్రలో గమనించినంతవరకు యిదివరకు జరిగిన విప్లవములు, ఆయుధబలముతో యే ఒకటో రెండో పట్టణములలో ప్రారంభింపబడి, ఒకవర్గమునుండి యింకో వర్గ ప్రజలు అధికారము లాగుకొనుటతో అంతమైనవి. విస్థారమైన దేశములో కోటానుకోట్ల ప్రజలు తిరుగబడి పల్లెటూరు పట్టణములకు గల సంబంధమును త్రెంచివైచి, ప్రభుత్వబలమును శాఖోపశాఖలుగా చీల్చి, నిరంకుశప్రభుత్వపు మొత్తపు యంత్రమునే యేవిధముగా పూర్తిగా నాశనము చేయగల్గుదురో మనపోరాటం నిరూపించింది. ఈవిధముగా ప్రభుత్వాన్ని చీల్చి చెండాడుటకు విధ్వంసక యీనిట్లు యెంతముఖ్యమో ప్రతి గ్రామమును స్వయంపోషకముగా చేయుట కూడా అంతముఖ్యము. ఒక ప్రక్కన రోడ్లు తీగలు నరికివేయుట యెంతముఖ్యమో, రెండవ ప్రక్క ప్రతిగ్రామమునకు సరిగా ఆహారమును పంచి, చరఖా నాడించుట అంతముఖ్యము. రెండు భాగములసమ్మేళనమే, మన యేడులక్షల గ్రామమునుబంధించి, దోపిడీచేసి కులుకుచున్న ప్రభుత్వపు గొంతెమ్మకోరికలను కబళించి వేయగలవు. ఇందువల్ల ఆర్థికంగా, సాంకేతికముగా ప్రభుత్వము దెబ్బతినును. రోడ్లను తీగెలను నరికివేయుటవల్ల ప్రభుత్వాధికారము నాశనము చేయగలము. చరఖానుచేపట్టి, ధాన్యాన్ని అమ్మకుండుటవల్ల ఆర్థికముగా దెబ్బగొట్టగలము.

కొద్దిమార్పులకు ఒప్పుకొని యెంత మంచి వుద్దేశముతో ప్రభుత్వాధికారమును వశము చేసికొన్నను, దానిపైననే భవిష్యత్తు ఆధారపడిలేదు. ప్రభుత్వ బలగముల చీల్చి చెండాడు నంతవరకు నిదురపోగూడదు. ప్రతిగ్రామము, ప్రతిపౌరుడు దీనికి తోడ్పడాలి. ప్రభుత్వ నిర్వహణములో వీరందరకు అధికారముండవలెను. ప్రస్థుతపు ఆర్థిక రాజకీయపు అధికారాలు కొన్నిపట్టణములలో కొంతమంది చెప్పుచేతులలోనున్నవి. ఇదినశించాలి. నిరాయుధమైన మనపోరాటము ఒక్క గంతులో దీన్నంత సంపాదింపగలదని నేను ఊహాగానము చేయుటలేదు.

నిరంకుశయధికారమును భిన్నాభిన్నముచేయుటతోనే మనపని ముగియదు. స్థానికాధికారముల వశపరచుకొని నిరంకుశాధికారులకు మరల తావులేకుండా పాలనము సాగించుటకు మనము తయారుగావుండాలి. ఏపునాదిపై మనవిప్లవము నిర్మించబడినదో ఆపునాది మరువకూడదు. ఈ సందర్భములో మరల చరఖానుగూర్చి ఆలోచింతము. చరఖారూపములో మార్పులేకుండా పాతపద్ధతినే వుపయోగించకూడదు. దీనికి నవీన పద్ధతులతో మార్పుగల్పించి పురోభివృద్ధిచిహ్నము చేయవలెను. పాశ్చాత్య పరిశ్రామికాభివృద్ధిజూచి, ఒక్కసారిగా యధావిధిగా తెచ్చిపెట్టనుంకించుచున్న శాస్త్రవేత్తలకు, పారిశ్రామిక నిపుణులకు యీపద్ధతి నచ్చకపోవచ్చును. కేంద్రముల నిర్మూలించి, గ్రామగ్రామమునకు పరిశ్రమలను తీసుకవెళ్లి వుత్పత్తినేమాత్రము తగ్గకుండా చూడదలచిన మనరాజకీయవేత్తలు యిందులకు సాయపడ వలసినదని ముందుముందు శాస్త్రవేత్తలనడుగుదురు. విద్యుశ్ఛక్తి, నావికా నిర్మాణము, విమానములు, మున్నగునవి చాలకాలమువరకు కేంద్ర పరిశ్రమలుగనే వుండవలెను. సాధ్యమైనంతవరకు కేంద్రప్రభుత్వమును నిర్మూలించ వలెను. ఆధునిక పద్ధతులపై నిర్మింపబడిన చరఖాలు, నూలుమిల్లుల బానిసత్వమునుండి తప్పింపగలవు. యీమిల్లులు జాతీయస్వాతంత్ర్య పోరాటమునుయేవిధముగా నిరోధించుచున్నవో యింతకుముందే చర్చించి యున్నాము. ఆవిధముగనే సాగనిచ్చిన స్వాతంత్ర్య పురోభివృద్ధికి ఆర్థికసమస్యా పరిష్కారవ్యవస్థలో అడ్డంకుల తెచ్చిపెట్టును.

## 7. బ్రిటిషువస్తు బహిష్కారము

బ్రిటిషువస్తువులు మరల కుప్పలు తెప్పలుగ వచ్చి పడుచున్నవి. యుద్ధపరిశ్రమలు కుంటుబడినను జంకక, సముద్రాంతర వ్యాపార పిపాసతో నావికాదళమును, కొంత వుత్పత్తిశక్తిని యిందుకు కేంద్రీకరించుచున్నది. భారతముఖ్య వ్యాపారమును కైవసము చేసుకొనకున్న తనజీవితమే అంధకార బంధురముగాన, విపరీత ప్రయత్నములు చేయుచున్నది. తన వస్తుసముదాయమును యిచ్చట విక్రయించి ధరలు పడిపోకుండా చూడలేక పోయిన మొత్తపు ఆర్థిక వ్యవస్థయేకూలి ఒంటికాలుపై నిలుచున్న కరెన్సి మునిగిపోవును. కొంచెముస్థిమితము చిక్కునంతవరకు తనవస్తువులను చవుక

ధరలకు విక్రయించుట పెద్దకష్టములలోని విషయముకాదు. ఎంతఆదాయము కావలెనన్న అంతఆదాయాన్ని కరెన్సి అచ్చువేయుటతో సంపాదింపగలదు. ఇప్పటికప్పుడే మనవిఫణి వీధులలో కన్పించు ఎలక్ట్రిక్కు బల్బులు, సైకిళ్లు, గుడ్డలు, రైలుయింజన్లు, రేడియోలే, ఈవ్యవస్థ ప్రారంభమైనదనుటకు తార్కాణము.

కొంచెము నగిషీతనము, చవుకధర అనగానే మనబుద్ధిఅటు పరుగిడుచున్నది. బ్రిటనుచే తయారగు ప్రతివస్తువును బహిష్కరింప మనముతయారుగా వుండాలి. బహిష్కరణోద్యమం బాగాసాగాలి. నావికాదళపు కొరతవల్ల గతకొద్దిసంవత్సరాల్లో బ్రిటను తనవస్తువులు దిగుమతి చేయలేక పోయింది. అప్పుడుమన స్వయంశక్తిపైన ఆధారపడినాము. ఇప్పుడును ఆ స్వయంశక్తిపైనే ఆధారపడి బ్రిటిషువస్తు బహిష్కారాన్ని నెగ్గింపవలెను.

ఈ విధముగా బహిష్కరించుటచే మన పెద్దశెట్ల బొజ్జలు యింకా కొంచెము పెరిగిన పెరుగుగాక, ఈ పర్యవసానాన్ని మనము కోరుకొనుటలేదు. జాతీయ స్వాతంత్ర యుద్ధరంగము వీరి అధికారము, చెప్పుచేతలలో మెలగదలచుకోలేదు, దీనికి తార్కాణము ఆగస్టు పోరాటము కూడు గుడ్డలేక మలమలమాడు ప్రజల నెత్తురు త్రాగి త్రాగి తాతోలు, బిర్లాలు అంతంత పొట్టలు పెంచుకున్నారు. మన కాయకష్టమే వీరి ధనరాసుల పెంచి కాపాడుచున్నది. ఇంతవరకు మనము సహించాము. దీని పర్యవసానముగా వీరు పర ప్రభుత్వంతో చేతులుకలిపి దోపిడీలో భాగము పంచుకొని మన నెత్తురును మరీమరిపీల్చి శల్యములుగా వదిలారు. ఇదే మనకు వారివల్లజరిగిన ప్రత్యుపకారము. యింకా కాంగ్రెసు నాయకుల చుట్టుచేరి మరలవారి పాతపాటలను పాడుటకు కలలుకంటున్నారు. కొంతకాలవ్యవధిజరగగానే, వారు మనలయేవిధముగా దోచుకొన్నది మరచిపోదుమని తలంచుచున్నారు. ప్రభుత్వాధికారమును వారి హస్తగతము చేసుకొని తమ ధనరాసుల కాపాడుకోగలమని కలలు కంటున్నారు. అప్పుడే ఆర్థికాభివృద్ధి కని ప్రణాళికలపై ప్రణాళికలువేయు కాంగ్రెసు వాదులను ఆధారముచేసుకొనుచున్నారు. మేము ట్రస్టీలముగావుండి సమస్తకార్యకలాపమును నిర్వహింపగలమని చెప్పుచున్నారు. దీనిని మహాత్ముడు గుర్తింపవలెను. ఇరువది సంవత్సరాలుగా పాటుబడి ఒకపక్షపాతపు ట్రస్టీనిమాత్రమే

సృష్టింపగల్గినది మరువకూడదు. ఈఒక్కడుకూడ మరణించెను. ఇంకపోతే యేమహామహులను ట్రస్టీల చేయదలచెనో వారిప్పుడే గాంధిజీ నెత్తురులోనే చేతులు కడుగుకొని స్వలాభమునకు పాటుబడుచున్నారు. కష్టించి చేయగలంతవరకు గాంధిజీ చేశాడు. ఒకమంచి అనుకూల వాతావరణములో మనల వదిలిపెట్టారు. ఇక్కడనే కూర్చొని నిదురపొమ్మని మనకు చెప్పుటలేదు. పురోభివృద్ధి ప్రారంభించి అహింసా సంఘమును సర్వతోముఖముగా గట్టి పునాదులపై నిర్మించి సాగిపొమ్మనుచున్నాడు. మన నాయకుని మనము నిజముగా అనుకరించుచున్నామేని, అనుకూల పరిస్థితుల కల్పించి, సక్రమమార్గాన్ని చూపినపుడు. విజయధ్వానములతో ముందుకు సాగిపోవలెను. కేంద్రపరిశ్రమలను సాంఘికములుగా చేయ పాటుబడవలెను.

ఈ కార్యక్రమమంతా భవిష్యత్తుకు సంబంధించినది. కాన యీలోపల మన చేరీశెట్ల ధనరాసులు యెల్లాపెద్దవగుచు పర్వతరూపాన్ని దాల్చుచున్నవో మరచిపోకూడదు. ప్రస్తుతానికి తాతాగారి యినుముకొనుటకన్న బ్రిటిషువారియినుము కొనుట యొక్కువ పాపమని గుర్తింపవలెను. రాలీ సైకళ్లను బహిష్కరించి హింద్ సైకళ్ల కొనుట కొంతనయము. విదేశ ప్రభుత్వము పాతుకొనిపోయి జీవించుటకు పరదేశవస్తువులను కొనుటే ఆధారము. స్వదేశివుత్పత్తి నిండుగా వారితో యేకీభవించలేదు. ఎన్ని బ్రిటిషువస్తువులను మనము కొనుచున్నామో, పరప్రభుత్వము మనస్వాతంత్ర్యలక్ష్మిని బంధించినగొలుసును అన్ని చుట్లుగట్టిగా తిప్పి బిగించుచున్నామని గ్రహింపవలెను. పారిశ్రామిక వస్తువులు ముఖ్యావసరమైనపుడు కొనకతప్పదు. ఇట్టిసమయాల్లోకూడ ధరయెక్కువ, నగిషీతక్కువైన మన దేశపు వస్తువులనేకొనవలెను, ఇవ్విదొరక్కపోయినపుడు బ్రిటిషువారివిగాక యితరదేశపు వస్తువులనైన కొనవలెను. ఇందువల్ల మన గుత్తవర్తకులు యింతా బాగాబలియగలరు. వీరు ధనరాసులు పెంచుకొనువారేకాని ధైర్యములేనివారు. వీరితో పరిష్కారము తర్వాత అతిసులభముగా చేసుకోవచ్చును. చెరువుమీద అలిగి స్నానముచేయకపోరాదు. ఎన్నదినములు బ్రిటిషుప్రభుత్వము మనదేశములో కూర్చొని దోచుకో తలపెట్టినదో అన్నిదినములు, మనము బ్రిటిషువస్తువులను బహిష్కరించవలెను. లక్షలకు లక్షలు ప్రజలిదిగుర్తించాలి. అంతటితో వీరివిధి పూర్తికాలేదు. వారి

యిరుగుపొరుగువారికికూడా చెప్పి, నచ్చునట్లు బోధించి, బ్రిటిషువారి ఏవస్తువునుకూడ కొనకుండాచేయవలెను. "బ్రిటిషువస్తువులను బహిష్కరించాలి" అను నినాదంతో దేశము నలుమూలలు మారుమ్రోగవలెను.

## 8 ధ న ము

మన స్వాతంత్ర్య పోరాటానికి, ధనములేమికూడా ఒక అడ్డంకు. నిషేధింపబడిన సమయములో చిన్నచిన్న మొత్తములు వసూలుచేయుట బహుకష్టము. ఏకొద్దిదానధర్మములపైననో ఆధారపడాలి. ఈ దాతృత్వముకూడా చాలాకష్టబద్ధము దీనివల్ల విశేషధనము సేకరింపలేము. అధికసంఖ్యాకుల వద్దనుండి కొద్దికొద్దిమొత్తముల సేకరింపగల్గిన మన పరిస్థితులు చాలబాగుపడును. యెట్లుధనమును యెక్కువగా సంపాదింప గల్గుదుమో ఆలోచించివలెను. ముందు యేయేనియమములలో మనము ఖర్చు చేయవలెనో ఆలోచింతము.

జిల్లారాష్ట్రీయ వర్కర్లలో చాలామంది కేంద్రమునుండి ధనసహాయమునకు యెదురు చూచుచున్నారు. వివిధశాఖలకు పెట్టుపడిపెట్టగల బలము కేంద్రమునకులేదు. ఏప్రాంతములో మనము పనిచేయుచున్నామో, ఆప్రాంతములోనే అందుకు కావలసిన ధనమును సేకరింపలేకపోదుమేని, యేకార్యమును కొనసాగింపలేకపోవుట దీనికి కారణము కావచ్చును ఈ విషయమును నేనునొక్కిచెప్పునపుడు మనవర్కర్లు చాల విపరీతార్థములను కల్పించు చున్నారు. ఎచ్చట డబ్బుదొరకునో అచ్చటనే పనిచేయవలెనను అర్థాన్ని ఆపాదిస్తున్నారు. జిల్లారాష్ట్రీయ సంఘాల బాధలు యెక్కువ చేయుటకు నేనీమాటలు చెప్పుటలేదు. సాధ్యమగునంతవరకు స్థానికముగా ధనమును సేకరింపవలెననియే దీనికి తాత్పర్యం.

కొన్ని మదింపు పట్టీలలో (Budgets) ని మన ఖర్చును పరిశీలించు అవకాశము నాకు దొరికినది. ఇందు చాలాభాగము ఆఫీసు అద్దలకు వార్తలను బంపుటకు కొంతమంది వర్కర్లను పోషించుటకు ప్రచారమునకు ఖర్చుపెట్టబడినది. ఈ మదుపు పట్టీలనుచూచి నిరవ్వెపోతిని. ధనములో అధికభాగాన్ని, వివిధనిర్ణీత కార్యక్రమముల కొనసాగించుయూనిట్టకు ఖర్చుపెట్టుట ముఖ్యావసరము, వేలకువేలు స్థానికయూనిట్ల

సౌకర్యములకే వుపయోగింపవలెను. ఈ యూనిట్లపైననే విప్లవము ఆధార పడివుంది. అన్న సంగతి మరచిపోరాదు. ఇందుకొరకు విపరీతమైన ఖర్చుగు టనిజము. ధనము వచ్చుచోట్లు ప్రస్తుతము చాలస్వల్పముగా వున్నవి. ఈనాటివిపరీతమైన ఖర్చులతో కొద్ది సామగ్రిగల దుకాణములను నడుపుచున్నాము. వస్తుసామాగ్రిని జాస్తిగా పెంచిననేయీవ్యాపారము నడిపి, ఈ విపరీతపు ఖర్చులకు మనము తట్టుకోగలము, అంతవరకు యీ విప రీతఖర్చులు కొంత తగ్గించుకోడానికి ప్రయత్నింపవలెను.

స్థానికముగా అధిక సంఖ్యాకుల వద్దనుండి ధనమును సేకరింపవలెను. ఈనాడు మనకున్న ఆర్థిక దౌర్బల్యమును బాపుకొనుటకిదే సరియగుమార్గము. చిన్నచిన్న మొత్తములు వసూలుచేసి జాతీయపోరాటమునకు పాటుబడు చున్న వర్కర్లకు ముట్టచెప్పవలెను. ఇది కష్టమైనపనికాదు. కళాశాలలు వదలి జాతీయ పోరాటములో పాల్గొనుటకుముందు విద్యార్థులుకూడా హుండీలు వసూలుచేసి జిల్లాకేంద్రముల కిచ్చుచుండవలెను. జిల్లా ముఖ్య స్థానములలలోని ప్రజలకు, విశ్వవిద్యాలయములోని విద్యార్థులకు విప్లవ కారులతో సంబంధము సంపాదించుట అంతకష్టమైన పనికాదు. కేంద్ర ములో మూలధనము కలదనియు, దానివల్ల విప్లవము నడువకలదనియు పెద్రిభ్రమలకు లోనుకావద్దని బస్తీప్రజలను, విశ్వవిద్యాలయ విద్యార్థులను హెచ్చరించుచున్నాను. దొంగతనముగా దోచుకొన్న డబ్బుతో కేంద్రము విప్లవమును నడుపుచున్నదని కొందరు భావిస్తున్నారు. ఈ పుకారువిని కేంద్రముతో సంబంధమువున్ననేను నిర్ఘాంతపోయాను. మన శక్తిసామర్థ్య ముతో ప్రజలవద్దనుండి యెంతధనము సేకరించిన అంతమంచిది.- ఈవిధ ముగా వసూలుచేసి వప్లవ కార్యక్రమము నడుప సాయపడమని మరల ప్రజలకు నేను విన్నపము చేయుచున్నాను.

దజనుకు కొద్దిగనో గొప్పగనో వుండు కోటీశ్వరులు జాతీయ పోరాటమునకు వ్యతిరేకులని నిర్ణయించితిమి. మనదేశములోవున్న అధికసం ఖ్యాకులగు భాగ్యవంతులుకూడా విప్లవమును వ్యతిరేకించుచున్నారు. కాని వీరు కొంతనయము. కొందరుధనమిచ్చిరి. కొందరు పోరాటములో పాల్గొనిరి. భేరీసెట్లుమాదిరి జాతీయపోరాటానికి వీరు అడ్డునిలువక కొంత ధైర్యముచూపిరి. ఇట్టివారివద్దనుండి న్యాయతః మనము యెక్కువసాయము

తీసుకోవలెను. మన కార్యక్రమముతో యేకీభవించి పాల్గొనుటకు ఒప్పు కొనిన మన సంబంధములకూడా యివ్వవలెను.

## 9 పారిశ్రామిక కూలీ

1920 వద్దనుండికూడా పారిశ్రామికులనుకూడా పోరాటములో పాల్గొనునట్లు చేయవలెనని గాంధీజి చెప్పుచున్నాడు. అప్పటినుండి కాంగ్రెసు యెన్నొ తీర్మానాలను చేసింది. కాని కాంగ్రెసువాదులు దీని ప్రాముఖ్యమును గుర్తింపలేకపోయిరి. పోరాటమునకు ప్రజలలోని వివిధ వర్గములెంత అవసరమో, కార్మికుడుకూడా అంతముఖ్యము. పోరాటసమయములో నూటికి డెబ్బదిమంది కార్మికులు సమ్మె సాగించిరి. సక్రమముగా పూర్తిసమ్మె జరుగనేలేదు. దీనికి వీరిలో వుత్సాహము లేకపోలేదు. అమితమైన ఉద్రేకులువీరు. సక్రమముగా యీ వీరులు సమ్మె సాగించుటకు పోరాటములో వారు నిర్వహింపవలసిన బాధ్యత. కార్యక్రమమును జూపుటకు సరియగు నిర్మాణ సంస్థలేదు.

ఈలోపమునుచూచి సామ్రాజ్యవాదులు, ట్రేడుయూనియన్లు, కమ్యూనిష్టులు, పారిశ్రామిక కూలీప్రాతినిధ్యము గలసంస్థలు మావేనని విర్రవీగుచున్నారు. విపరీత ప్రయత్నముచేసి సమిష్టిసమ్మెను ఆపలేక చతికిలబడినది అప్పుడే మరచిపోయిన ట్లున్నారు. పోలీసులువచ్చి, భయపెట్టి, తుపాకులుకాల్చి, ఫాక్టరీలలోకి బలవంతముగా త్రోసినతర్వాతనే ఈమహామహులు ఆప్రాంతములో మొహము చూపగలిగారు. ఎవరిబలమునోచూచి సంతోషించు ధీరులంటే వీరె. వీరిదృష్టిలో వారే కూలీపరిస్థితులకు తోడ్పడుచున్నామని తలచుచున్నారు. చాల అవకతవక రూళ్ళ క్రసిద్ధాంతముతో యీయుద్ధాన్ని ప్రజాయుద్ధమని సమర్థించి, పారిశ్రామికుల నిర్వీర్యులచేయ ప్రయత్నించు చున్నారు. ఏకష్టములతో కూలీలు బాధపడుచున్నారో, తీయని మాటలుచెప్పి, అచ్చటనే సుఖపడు చున్నారనిబోధింప నుంకించుచున్నారు. ఇది గంతకట్టుకొని పిల్లి పాలుత్రాగు చున్నట్లున్నది. కమ్యూనిష్టులు, ట్రేడుయూనియన్లు చేయు దుష్ప్రచారమును మట్టుబెట్టవలెను. కొద్దిరోజులలో పెద్దసమ్మె జరుపుటకు వీరికి అవకాశము రావచ్చును. శ్రామికునకు స్వేచ్ఛనిచ్చి, కష్టసుఖముల విచారింప గల్గునది

స్వతంత్రభారత దేశమేగాని, రష్యా యింకయే పరప్రభుత్వము గాని, కాదని బోధింపవలెను. రష్యానుచూచి సతోషించిన కూలీ ఆకలితీరదు. శ్రామికుడు ఆర్థికముగా అర్భకుడు. ఈదారిద్ర్యము వీనిని ఫాక్టరీకితరిమి పనిచేయించు చున్నది. జాతీయవిప్లవము జరుగునపుడు చూస్తూ కూర్చొ కూడదు. కష్టములను సహింపవలెను. విజయవంతముగా పోరాటము సాగుటకు పాటుబడవలెను. స్వాతంత్రాన్ని సాధించాలి. అప్పుడు శ్రామికుని సమస్తబాధలు, సర్వకష్టములు గట్టెక్కగలవు.

విప్లవములో శ్రామికుని ప్రాముఖ్యత నిర్వహింపవలసిన కార్యక్రమమును యిప్పటికైన కాంగ్రెస్‌వాదులు గుర్తింపవలెను. పారిశ్రామికుని కష్టసుఖములు మనకష్టసుఖములు. వీరుమన సోదరులు. వీరిజీతములు పెంచుటకు, బోనసు లిప్పించుటకు, నష్టపరిహారము లిప్పించుటకు, బర్తరఫుచేసినపుడు వీరిపక్షమున పోరాడి, న్యాయము కలుగ జేయుటకు పాటుబడ వలెను. కాంగ్రెసే తల్లిసంస్థయని బాగుగా వీరిచే గుర్తింపచేయవలెను. ఫాక్టరీలో పనిచేయు కూలీగాని, రైగుమతులు దిగుమతులలో పనిచేయు కూలీగాని, యీనిర్బంధ ప్రభుత్వ మున్నన్ని దినములు వారి కష్టనష్టములు గట్టెక్కవని గుర్తింపవలెను. ఏనాడు మనము స్వాతంత్ర్యము సంపాదింతుమో ఆనాడు మనకష్టములన్నియు విచ్చపురుగుల మాదిరి విచ్చిపోవును. వీరినందరిని యూనిటుకు అయిదుగురుగా విభజించి నిర్మాణయుత కార్యక్రమము చూపి పనిచేయించవలెను పోరాటానికి సన్నద్ధ పరుపవలెను.

## 10 ప్రచ్ఛనోద్యమము

పరప్రభుత్వమునకు విధివిరామ మివ్వక పోరాటానికిసర్వప్రయత్నములు చేయు మూరాయే ప్రచ్ఛన్నులు. వారి భావాల పోకడ కష్టసుఖములు బయటపెట్టుటరాయే నావిధి. ఈసందర్భములో నేనును వారిలో ఒకడనైనని యీ దేశసేవాతత్పరులు గుర్తింప వేడెదను. అమిత క్లిష్టపరిస్థితులను, అమిత మనోధైర్యముతో యెదుర్కొను వీరసింహములు వీరె. అహోరాత్రములు దేశమునకు యేసందర్భములో యెల్లావుపయోగపడతామా అని తాపత్రయ పడుచుందురు. ఏదేశముగాని తన స్వాతంత్ర్యము కొరకు పాటుబడ్డ బిడ్డల వీరోచిత కృత్యములను మరచి పోరాదు.

వారిత్యాగాలను అప్పుడప్పుడు స్మరించుట మనకు నూతనోద్రేక ఉత్సాహములను తెచ్చిపెట్టును.

ఇంకను చాలామంది ప్రశ్నన్నలుగానే వున్నారు. వీరు కష్టించి స్వాతంత్ర్యమును అనుభవిస్తున్నారు ప్రభుత్వాన్ని ధిక్కరించి అరెస్టు కాకుండా వేధించు చున్నారు. ఇట్టివారికి అమితమైన ధైర్యసాహసము లవసరము. ప్రస్తుతము మన దేశములో వీరి పాటివీరులు చాలా కొద్దిమందే వున్నారంటే యిది మన దురదృష్టము. ప్రజలు మనలను చాలా యెక్కువగా ప్రేమించి, పొగడుచుందురు. అణుమాత్రము చెలింపని మన మనోనిశ్చయముల కొనియాడుచుందురు. ఈ పొగడ్తలకు చెవియొగ్గి కూర్చోరాదు. మనము యెంతతక్కువ విశ్రాంతి తీసుకొని కార్యాసక్తులమైన అంతమంచిది. ఏకొద్దోమనముచేసిన ధైర్యసాహసోపేత పనులుగూర్చి, తెలివితేటలగూర్చి, చెప్పుచు కాలము వెళ్లబుచ్చకూడదు. ఎన్నిసార్లుమనము ప్రభుత్వపు బారినుండి తప్పించుకొన్నామో, ఎంతశ్రమ కోర్చుకున్నామో, ప్రజలు చెప్పుకొనుచున్న విని, సంతోషించుచు కూర్చోరాదు.

ఒకొక్కరము ఎంత నిషేధ కరపత్రముల ప్రచురింపగల్గుచున్నామను విషయాన్ని యెవ్వరు పరీక్షింపనవసరములేదు. చేతిలోవున్న పని కదా అని ప్రచ్చన్నలు చిన్నచిన్న పుస్తకములు, పక్షపత్రికలు, కరపత్రములు ప్రకటింప తాపత్రయపడకూడదు. ఈ మాటలుచెప్పి, నిషేధ వాఙ్మయమునకున్న విలువను తగ్గించుట నాపనికాదు ఈ పనిని ఒకటి రెండు కేంద్రములకు వదలుట మంచిదని నాభావము అన్నిస్థానిక సంస్థలు, వారపత్రికలు ప్రకటనలకే పూనుకొన్న తదితర కార్యక్రమమును నిర్వహించువారెవరు? కేంద్రములు ప్రకటించిన పత్రికలను కాలవిలంబనములేక పంచిపెట్టుట, స్థానికసంస్థల ముఖ్యవిధులలో ఒకభాగము. కేంద్రమునుండి వచ్చు పత్రికలు స్థానిక సంస్థలకు, స్థానికసంస్థలు విరివిగా పంచిపెట్టు కరపత్రములు ప్రజలకని నాభావము. కేంద్రములు యెన్ని చిన్న పుస్తకములు పత్రికలు ప్రకటింపగలిగారు, స్థానిక సంస్థలు యెన్నెన్ని కరపత్రములు వేయగలిగినవి, అనుసంగతి యెవరు లెక్కింప వలసిన అవసరంలేదు.

జాతీయ పోరాటములో వివిధ ప్రాంతములలో పనిచేయువారి సమర్థత విచారించుటకు రెండే రెండు ప్రశ్నలున్నవి. మనము చేసినకార్య క్రమమువల్ల వెంటనే గల్గిన ఫలితమేమి? భవిష్యత్తు పోరాటములో గట్టిగానిలచి పోరాడగల సంస్థల నెన్నిటిని నిర్మింప గలిగాము? ఈ రెండు ప్రశ్నలతో యెవరైన మనల పరీక్షించిన మనము గొప్పగా చెప్పుకోతగ్గదేమియు లేదు. ప్రస్తుతము సమిష్టి అసహాయోద్యమమునకు సత్యాగ్రహామునకు విధ్వంసక కార్యక్రమమునకు దేశమును తయారు చేసినది చెప్పుకోతగ్గ విషయముకాదు. ప్రారంభములోనే యెక్కువ ఫలితములు పొందనందుకు మనము యెక్కువ నిరుత్సాహ పడనవసరము లేదు. భవిష్యత్తు పోరాటమునకు విరివిగా యీ కార్యక్రమముల కొనసాగింప గలిగిన మన కష్టములకు ఫలితము గల్గును. సమిష్టి అసహాయోద్యమమునకు గ్రామస్వయం పోషనకు యెన్నియూనిట్లు తయారు చేయగలిగాము? నిర్ణీతవిస్తీర్ణములలో ఒకేఒక కాలములో విధ్వంసక కార్యక్రమమును కొనసాగింప యెన్నియూనిట్లు నిర్మించాము? పరిశ్రామిక కూలీలు ఫాక్టరీలు మానివేసి, విద్యార్థిబృందము పాఠశాలలు మూయించివేసి, స్వాతంత్ర్యము చవిచూచునంతవరకు నిర్విఘ్నముగా సమ్మెలు జరుపుటకు యెంతమంది సామాన్యప్రజలలో చైతన్యము తేగలిగాము. యీప్రశ్నలన్నిటికి మనజవాబు సంతృప్తికరముగా లేదు. మనము నిర్వహింపవలసిన పోరాటమునకు కల అడ్డంకులు, ఆ యాసాకులు చెప్పినందువల్ల యెవరికిని ప్రయోజనము లేదు. మనము నిర్వహింపవలసిన కార్యక్రమములో మార్పు ముఖ్యావసరము. ప్రతిమానవునిలోని వ్యక్తిగతోత్సాహము రేకెత్తుటకు పాటుబడి, అదిపీగి పోకుండచేయుటకు యేర్పడవలసిన కార్యనిర్వాహకయూనిట్లను తయారు చేయవలెను. మనము అనుసరింపవలసిన ముఖ్యసూత్రముల బయటపెట్టు టకు యింతవరకు ప్రయత్నించినాను.

రాజకీయ వర్కర్లు ఒకరిపైనొకరు నిరంకుశాధికారము కొరకు ప్రాకులాడు నందువల్లగలుగు అనర్థకములు అదిలోనే తెలిపాను. ప్రచ్ఛన్నలుగానుండి ఉద్యమ విజయమునకు పాటుబడు వారిలో యీ విష బీజము పొడమినగల్గు ఫలితములు వేరుగా నుగ్గడింపవలసిన పనిలేదు. ఒకరినొకరు అనుమానము, అసూయలతో చూచుకొనుచుంటిమేని ప్రతిది విషమముగానే, కనుపించుచుండును. ఇది మనగోతిని మనమే త్రవ్వ

కొనుట. ప్రభుత్వముతో అసహాయోద్యము సాగించి, చివరకు మనలో మనము అసహాయోద్యమము సాగించుకొనుటతో మనచరిత్ర అంతము కాకూడదు. ఈ విషబీజమునకు, అధికారవాంఛ, నిర్ణీత బాధ్యత వహింప కుండుట, సామరస్యము పెంపొందింప జేయుటలో దౌర్జన్యము, యితరుల గొప్పతన మున్ద్వేషించుట అనునవి ప్రధానవ్రేళ్ళు. ఇది మానవ సమాజగుణము. మనము నిర్వహింపవలసిన కార్యక్రమమును విభజించి, నిర్ణీత కార్యక్రమమునకు బాధ్యతవహించుటకు తయారైయుండవలెను. అవసరపుటార్భాటము పనికిరాదు. అందును నిషిద్ధకార్యక్రమమునకు పూనుకొన్నపుడు వేరుగా చెప్పనవసరములేదు. కార్యదక్షత కావలెను. నిర్మాణయుత సంస్థలగూర్చి కార్యక్రమమును గూర్చి పూరక బుర్రలు పగుల కొట్టుకొనరాదు. ముందు మనము పూనుకొన్న నిర్ణీత కార్యక్రమమును కొనసాగింపవలెను. ఫలితముల పొందవలెను. తర్వాత అవసరమైనపుడు మనతోటి వర్కర్లతోగాని మనపై నాయకులతోగాని ఓర్పువహించి, మాటిప్రశ్నలడిగి జవాబులు తీసుకొని సంతృప్తి చెందవలెను.

పరిశ్చిన్నులగువారు ఒకరినొకరు పొగడుకొనుచు, ఒకరిభుజముల నొకరు రాచుకొనుచు, ఒకరికష్టముల కొకరు పశ్చాత్తాపపడుచు, ఒకచోట గుమిగూడి, ఒక తెగగా పరిణమించ బడరాదు. కష్టములకోర్చి పాటుబడి కార్యక్రమమును నడుపునపుడు, అప్పుడప్పుడు గొప్పవారమను భావము గలిగించవచ్చును. ఇదియు కూడదు. కొందరు ధైర్యవంతులు విధ్వంసక కార్యక్రమమును తీసుకొన్నారు. ఇదిచాల విజయవంతముగా సాగుటకు అనేకయూనిట్లను తయారుచేశారు. వీరు గొప్పవారె. కాని యింతమాత్రమున మనపోరాటము వివిధ శాఖలపైన ఆధారపడి వున్నదనుమాట మరువరాదు. వీరెంత బలవంతులు ధైర్యవంతులైనను, యితరుల సాయములేనిది ఫలితముల పొందలేరనునది గుర్తింపవలెను. మనఅహింసాయుత బహిరంగ పోరాటము కొండపైబుట్టిన పెద్దనదివంటిది. ఇదికొండపై అనేక పిల్లకాలువలగా బుట్టును. వేయిప్రవాహములుగా ప్రవహించి క్రిందికిచేరును. పెద్ద ప్రవాహములు చిన్న ప్రవాహముల జూచి వెక్కిరింపవు, నవ్వవు. ఇవి అన్నియుకలసి ఒకపెద్దనదిగా ప్రవహింప ప్రయత్నించును.

పరిస్థితుల ప్రభావమువల్లగాని, కోర్కెవల్లగాని చాలామంది ప్రచ్ఛన్నులున్నారు. వీరు "మీరు స్వాతంత్రులుగా భావించుకొండు" అని

మహాత్ముడు సామాన్యమానవుల నుద్దేశించి హెచ్చరించినది మరువకూడదు. వారిపరిస్థితులు యెంత విషమముగా నున్నను, ప్రతిప్రచ్ఛన్నుడు ప్రజల వద్దకువెళ్ళి ఉద్రేకపరచి "నేను స్వతంత్రుడను" అనుభావము కలుగునట్లు పాటుబడవలెను, బ్రిటనుపై ద్వేషము ప్రజ్వలింప చేయవలెను. స్వాతంత్ర్య పిపాస హెచ్చుపెరిగి పోవలెను. వెంబడే జయము గలుగుగాక అపజయము గలుగుగాక, జంకకూడదు. ప్రతిసామాన్య మానవునిలోకూడ స్వేచ్ఛావాయువులు నిరభ్యంతరముగా వీవవలెను. వ్యక్తిగతోత్సాహము మిన్నుముట్టవలెను. ప్రతినిర్ణీతకార్య క్రమమునకు పూనుకొనువాడు "నేను స్వతంత్రుడను" అనుధీ మాతో ప్రారంభింప వలెను. ప్రపంచ చరిత్రలోనూటయేబది సంవత్సరముల నుండి మనదేశము బానిసదేశముగా నున్నది. ఏవిషయములోకాకున్నను యీ విషయములో మాత్రము ప్రపంచమున కంతకును తెలిసాము. హిందూదేశములో పదిలముగా నుండుటవల్లనే బ్రిటను ప్రపంచ అంతర్జాతీయ రాజకీయములలో, యుద్ధవిజయములొందుచు, అధికారమును చెలాయించుచున్నది. ప్రపంచ పతిత ప్రజల భవిష్యత్తు మనపై ఆధారపడివున్నదనుటకు యిది తార్కాణము. కార్యసాధనకు నడుముగట్టి యీనాటినుండి మనము స్వాతంత్రులమని భావించుకోవలెను. దాశ్యశృంఖలు త్రెయ్యలుగొట్టి, యెవరికొరకో యెదురుచూడక, మన బాధ్యతను మనము నిర్వహించడానికి దీక్షవహించి పనిచేయవలెను. ప్రపంచములో బానిసలుగా బ్రతుకుటకు మారు, ప్రపంచ చరిత్రనే తారుమారుచేసి సర్వమానవ సౌభ్రాతృత్వము నెలకొల్పు బాధ్యత భారతీయులది. ఇందులకు ప్రపంచ పతితప్రజలు యెదురుచూచుచున్నారు. ఆలశ్యము చేయక యింక కార్యక్రమమునకు పూనుకొందాం.

---

# మా పుస్తకములు



కాంగ్రెస్ సోషలిష్టునాయకులు

పాకిస్థాన్ - మార్క్సిజం

ఆగష్టుగేయాలు

సంస్కారి

జయప్రకాశ్ - ఆగష్టువిప్లవం దాని ఆవశ్యకత

## ( అచ్చులో )

మహిళాప్రబోధం

క్రాంతి గీతాలు

యువజనకాంగ్రేసోద్యమం

విద్యార్థి కాంగ్రేసోద్యమం

జయప్రకాశ్ లేఖలు

